Approved as suitable for School Reading Vide page 479 of the Fort St. George Gazette dated 3-6-1924.

# వీరమహిమ

పోతనామాత్యుని భాగవతమునుండియు

శ్రీనాథుని హరవిలాసమునుండియు

పినవీరన్న జైమినిభారతమునుండియు

వడకుదుటి వీరరాజపంతులుగారిచే

సంగ్రహింపఁబడినది.




రెండవకూర్పు. 1000 ప్రతులు.

పిఠాపురము.

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1924.

 [Rs 0-10-0.

శ్రీదేవాయనమః.

# ఉపోద్ఘాతము.

మహాపురుషులచరిత్రములు గలగ్రంథములు భాషాదేవి కమూల్యాలంకారములు. అపార మగునీసృష్టియం దప్పుడప్పుడు లోకోద్ధరణమునకై మహాపురుషు లచ్చటచ్చట నావిర్భవించుచుందురు. వారు దమపవిత్రజీవితము లితరుల కాదర్శప్రాయములగునట్లు వర్తించి నటించి, పిదప నశ్వరము లగు తమభౌతికశరీరముల విడనాడి కీర్తిశరీరములఁ దాల్చి, యాచంద్రార్కము ప్రకాశించుచుందురు. అట్టివా రీభారతవర్షమున లెక్కకు మిక్కిలియున్నారు. పరోపకారార్థము ప్రాణముల నిచ్చినవారు గొందఱు; శరీరముల నొసగినవారు గొందఱు; సంతానముల నర్పించినవారు గొందఱు; సర్వస్వమును దారవోసినవారు గొందఱు. సత్యవాక్పరిపాలనముకొఱకు సహింపరాని కష్టములను లోనైనవారు మఱికొందఱు; మానసంరక్షణముకొఱకుఁ బ్రాణములనైన లెక్కసేయనివారు గొందఱు—ఇట్లే యనేకసత్కార్యముల ననేకవిధముల నాచరించిన మహానుభావులు పలువురు గలరు. భువనవర్ణ్యములైనవారిసచ్చరిత్రము లనేకపురాణాదిసద్గ్రంథములయందును, నానావిధగేయముల యందును వర్ణితములై సంతతపఠితములును నిరంతరపఠనీయములును నైయున్నవి. మఱియు వారిసత్ప్రవర్తనము లెల్లవా

రికి నవశ్య మనుకార్యములై యున్నవి.

నిఖిలలోకవంద్యు లగునిట్టిమహాత్ములు—దానవీరుఁడు, దయావీరుఁడు, ధర్మవీరుఁడు, సత్యవీరుఁడు, యుద్ధవీరుఁడు, కార్యవీరుఁడు మొదలగు ననేక (బిరుద) నామములతోఁ బేర్కొనఁబడుచున్నారు.

వీరుఁ డనఁగా విక్రమించువాఁ డనియర్థము. [విక్రమించుటయన, (వెనుకంజవేయక) ముందడుగిడుట.] అంతరాయము లెన్ని తటస్థించినను వానిని లక్ష్యపెట్టక, తాను పూనిన సత్కార్యమును నెఱవేర్చుకొనువాఁ డని భావము.

ఈపుస్తకమున దానవీరుఁడు, ధర్మవీరుఁడు, రణవీరుఁడు—అను ముబ్బ్వురుమహాపురుషుల సత్కార్యాచరణములయభివర్ణనములుగల చరిత్రములు పూర్వగ్రంథములనుండి యెత్తఁబడినవి. ఏతాదృశపుస్తకములు దఱచుగఁ దమ్ముఁ జదువువారి హృదయములను సన్మార్గములకు మరలించి, వారి యైహికాముష్మికసుఖంబులకు నిదానములగుచున్నవి.

ఆహ్లాదకరములును, రసపూరితములును, మనోహారకథాత్మకములును, నీతిబోధకములును, భాషాభివర్ధకములును నగు చిన్నచిన్నగ్రంథములు ప్రత్యేకముగ నాంగ్లేయాదిభాషల యందుంబోలె నాంధ్రభాషయం దంతగాఁ గానరామిం జేసి విద్యార్థుల యుపయోగమునకై యీగ్రంథము సంకలితము గావింపఁబడెను.

న. వీరరాజు.

శ్రీ గణేశాయనమః.

# దానవీరుఁడు.



"కృతేయుగే బలిర్దాతా" (కృతయుగమున బలిచక్రవర్తియే దాత) అనునార్యోక్తికి హేతుభూతుఁడై, స్వార్థత్యాగులలో నగ్రగణ్యుఁడై, దానవీరుఁడనువిఖ్యాతనామమును ధరించినమహాపురుషుఁడు బలిచక్రవర్తి. ఈతఁడు రాక్షసరాజవంశసంభూతుఁడు. భక్తాగ్రేసరుఁడును, ధర్మైకశీలుఁడును నగుప్రహ్లాదుని మనుమఁడు; విరోచనునికొడుకు. ఈతనితాతయగు ప్రహ్లాదుఁడు, తనపుత్త్రునిప్రాణములు పోవనున్నను నీతిపథమును దప్పని న్యాయవీరుఁడు; తండ్రి యగువిరోచనుఁడు, ఆర్తులకై తనయాయువును దారవోసిన దయావీరుఁడు. ఇట్టి వీరులవంశమున నుదయించిన మన దానవీరుఁడు దనవదాన్యశేఖరత్వమున మిగుల ఖ్యాతిఁగాంచి, పితృపితామహులప్రతిష్ఠకు వన్నెఁదెచ్చుటయే కాక వారివంశమునుసయితము పవిత్రమును గావించెను.

ఈతనిదానమహిమ మీగ్రంథములోని మొదటికథయందు వర్ణింపఁబడియున్నది. కావున దానింగూర్చి యిచ్చట విస్తరించి వ్రాయఁబనిలేదు. కాని యీమహామహుని ధర్మౌదార్యాతిశయమునుగుఱించి యించుకైనఁ బ్రశంసింపక యేలేఖిని యూరకుండఁగలదు?

బలిచక్రవర్తితో వామనమూర్తి యొనర్చిన చిత్రసంభా
షణముచే బ్రిబోధితుఁడై పురోహితుఁ డగుశుక్రాచార్యుఁడు,
తనశిష్యుఁ డగుబలీంద్రునకు మేలొనఁగూర్ప నెంచి, యీపొట్టి
వడుగునకు దానము నీయవలదనియు, నిచ్చినచో సర్వనాశ మ
గు ననియు, సర్వస్వము పోవునన్నపు డిచ్చెదనని యర్థము నీ
యకున్నను ననృతదోషము దగులదనియు ననేకములగువచన
ముల హితోపదేశము నొనరించెను. గురువరుని వాక్యములకు
దానవేంద్రుఁ డించుక యాలోచించెను. ఆచార్యుఁడు చెప్పినది
గృహస్థులకు యుక్తమైన ధర్మముగా నుండెను. సర్వస్వమును
పోవునట్లు దోఁచెను. భావ్యవస్థ గన్నులఁ గట్టినట్లుండెను.
ఉండిన నేమి? ఆదానవీరుఁడు సత్యమును దోఁచివైవక శుక్రుని
తో "ఆర్యా! మీయుపదేశము యుక్తమైనదే. కాని నానా
లుకపై ననృతమున కిసుమంతయుఁ జోటులేదు." అని పల్కు
చు సర్వస్వము వామనునికి ధారవోసి, తాను పాతాళము
వఱకుఁ బోయి యచ్చట సర్వాధికారియై శాశ్వతానందము నను
భవించుచు నుండెను! వదాన్యత యింతకంటెను మిన్నుముట్ట
నేరదుగదా!

అడిగినదానిని లేదనక యిచ్చుటయందు శిబిప్రముఖుల
తోడను, ఆడినమాటఁ దప్పకుండుటయందు హరిశ్చంద్రునితో
డను మన దానవవీరుఁడు తులఁదూఁగుచున్నాఁడు!

# బమ్మెర పోతనామాత్యుఁడు.

బలిచక్రవర్తిచరిత్రము సంస్కృతభాగవతమునఁ గలదు. భాగవతగ్రంథము నాంధ్రములోనికిఁ బరివర్తించినమహాకవి బమ్మెర పోతనామాత్యుఁడు. ఈతఁడు నియోగులశేఖరుఁడు. ఈతని నివాసస్థానము నైజాము రాజ్యములోని వోరుగల్లు. ఈతనితండ్రి కేసన; తల్లి లక్కమ్మ. ఈతఁడు శైవుఁడు. పదునేనవశతాబ్దియందు విఖ్యాతిగాంచినవాఁడు. ఈతఁడు తనభాగవతమును శ్రీరామచంద్రమూర్తికి నంకిత మొనర్చెను. ఈతఁడు సహజపాండిత్యుఁడు. ఈతనికవిత్వము మృదుమధురపదసంఘటితమై, యమకాదిశబ్దాలంకారములు గలిగి శ్రావ్యమై లలిత భావనిబద్ధమై యమృతధారవలె హృదయరంజకముగా నొప్పుచుండును. ఆయాఘట్టముల నాయారసములు చిప్పిలుచుండునట్లు వ్రాయుశక్తి యీతనికి వెన్నతోఁబెట్టినదిగాఁ గానవచ్చుచున్నది. భక్తిరసవర్ణన మీతనిసొమ్ము.

పోతనామాత్యుఁడు, నారాయణశతకము, భోగినీదండకము, వీరభద్రవిజయము అనుగ్రంథములు వ్రాసె ననికొందఱు సెప్పెదరు. కొందఱవి తద్రచితములు గావందురు.

ఇమ్మహాకవిగ్రంథమున లక్షణదోషములు గొన్నియున్నవని కొందఱు వ్రాసిరి:—

(1) రేఫఱకారమైత్రి:—నన్నయభట్టారకాది పురాతనకవుల గ్రంథములయందు దీరేఫద్వయమునకుఁ గలయైక గాన

రాదు. అక్కాలమున వానియుచ్చారణము భిన్నముగా నుండి నట్లును, తిక్కనాదులకాలమున నది సడలినట్లును దోఁచుచున్నది. కొన్నిశబ్దములలోని రేఫములకు ద్విస్వరూప్యము గల దని వాదించువారికిఁ దిక్కనాదులప్రయోగములే పట్టుఁగొమ్మ లయినట్లు గన్పట్టెడిని. శిథిలభాగపూరణములు వేఱుగ నుంచుచో నివ్విషయమునఁ బోతనప్రయోగములు తిక్కనాదులప్రయోగములకు సరిపోవుచున్నవి.

(2) ద్రుతమున కచ్చుపరంబగునపుడు సంశ్లేషము :—

"గోష్ఠిన్నెఱింగిన" (గోష్ఠిన్+ఎఱింగిన) 20 పుట, 92 ప.) ఇత్యాదులు.

గీర్వాణభాషయం దిట్టిప్రయోగము సాధువే.

"శీతేనావ్యథయన్నివ" (వ్యథయన్+ఇవ)-వేదము.

"తస్మిన్నద్రౌ" (తస్మిన్+అద్రౌ)—కావ్యము.

ఇట్టి ప్రయోగపరంపర ననుసరించి తెలుఁగుకవులును నిట్టిసంధి సాధువుగా గ్రహించినట్లు గానవచ్చెడి.

"సీ. పా. తత్కూపమున విలసత్కూలఘనవల్లి
యన్నిష్టసఖి నూఁది యున్నదాని" (అన్+ఇష్ట)
నన్నయ. ఆదిప. తృతీ 140, ఇత్యాదులు.

(3) శషప్రాసము :—

"ఆశాపాశము.............గాసింబెట్టక..."
(14 పుట. 71 పద్యము.)

ఈ "శ, స" లయుచ్చారణము పూర్వకాలమున నీభరతఖండమున నెట్లుండినదో నిర్ణయింపరాదు. కొన్ని దేశముల యందు శ, ష, స, అనునక్షరములు భిన్నోచ్చారణముగలవిగా వినఁబడుచున్నవి. (వేషము, వేశము, వేసము; కోసల, కోశల, కోషల; శాసనము, శాశనము—ఇత్యాదులు.) 'ప్రాసస్సర్వేషుచ ఏకఏవస్యాత్' అనునట్లు వీనిని వెవ్వేఱుగాఁ బ్రయోగించుట యుక్తియుక్తముగానే తోఁచుచున్నది గానియీ క్రిందిమహాకవిప్రయోగములు కొన్ని గానవచ్చుచున్నవి.

"ఆసభ........శై శంకలేక" భారతము. స్త్రీప.

"కంసునిబాధలం......వంశము..." ఎఱ్ఱనహరివం.

"సంసారభ్రమ......వంశము..." శ్రీనాథుఁడు.

(చూ. ఇందు 56 పు. 28 ప.) ఇత్యాదులు.

---

# ధర్మవీరుఁడు.

శివభక్తకథాపరంపరలోఁ జిఱుతొండనంబికథయొకటి. శైవులలో నిక్కథకుఁ బ్రచారము మెండు. చిఱుతొండనంబి శైవాచారసంపన్నుఁడు. ఈసంపన్నతయ యీతనియందు వెలిఁగెడి యుత్కృష్టధర్మము. తక్కిన గుణప్రపంచ మీధర్మము నకు దాసప్రాయ మని యీతనివిశ్వాసము.

సానదాఁకిన రవలు గడలుకొనుకొలఁదిఁ దమకాంతిసంపదను వెలువరించు మేలిరతనములుఁబోలెఁ, గష్టములు పైఁ గొనినకొలఁదిఁ దమయుత్కృష్టధర్మమును బ్రకటించుచుందురు మహానుభావులు. పరుసవేది దన్నుఁ దాఁకిన యినుమును బంగారుగా మార్చునటువలె, ధర్మరతులు తమసహవాసముగల తమతోడివారిని దమంతటివారుగా నొనర్తురు.

మనకథానాయకునకుఁ దనధర్మము పరీక్షింపఁబడుకాలము వచ్చినది. ముదుసలిజంగమురూపమున, నిశ్చలభక్తిపరాయణుండగు పరమేశ్వరునిచే, నాతనిధర్మము పరీక్షింపఁబడినది. సద్ధర్మఖనులగు నాతనియర్ధాంగియు ముద్దులకొమరుఁడును నాతనిధర్మమును బాలించిరి. పోషించిరి. ఎట్లు?

జలధరములు తెఱపిఁ గనక యిరువదియొక్కదివసములు 'కుంభద్రోణంబుగ దారుణధారాపాతంబు గురియుచుండె'ను. నగరమంతయు నేకార్ణవమైపోయెను.

'శివభక్త్యాచారసంపత్తికి సీమాభూమి' యగు మనకథానాయకుఁడు, ఆదుర్దినములలో 'నేమీకొంక' లేదు. వంటచెఱకు లేకున్నను వస్త్రములు తైలమున ముంచి వహ్నిఁగూర్చి వంటకములఁ జేయించి తన 'శ్రీవాకిట' వేనవేలు జంగములకు వవ్వారిగఁ బెట్టినాఁడు! వాన వెలిసినది.

'మహోత్పాతమగు నయ్యకాలవృష్టికి గడుంగడు భీతిలి 'వెలివినవాఁడ' యానగరమునందలి పాశుపత జంగమాదియోగి

ప్రముఖులెల్ల సవ్వీడు విడనాడి యెటయేని పోయిరి.

ఆనాఁడు చిఱుతొండనంబికి నతిథి లేఁడు. ఆశనమును మాని వెదకివెదకి యొకయతిథిని బట్టినాఁడు. అయ్యతిథి యెవఁడు? ఆ 'కపటమాయామహానాటకప్రపంచసూత్రధారి'! వృద్ధజంగమవేషధారి! ఆతనికి మననాయకుని యేకపుత్త్రుఁడు పసిపాపఁడు నంజుఁడుఁ గూరగాఁ గావలసివచ్చినది. అదియు నాతనిభార్యాపుత్త్రుల నిశ్చలనిర్మలాంతఃకరణాంగీకారముతోఁ గావలయునఁట! అయిననేమి? పతివ్రతామతల్లి యగునాతనియర్ధాంగికిని, సకలసద్గుణరాశి యగునాతని తనూజునకును నట్టియంగీకారముఁ జూపుటబరువా? కాదు. అతిసుకరము. అతిముదావహము.

వారియనుమతిని—ఆహా! ఆమాయావేషధారికి, ఆ జంగమసిద్ధవృద్ధునికిఁ దనయేకపుత్త్రునిఁ దఱిగితఱిగి వండించి కూరలు సేయించి పెట్టినాఁడు!

కష్టపరంపరాఝంఝామారుతమునకు నిర్మలధర్మాచలేంద్రము చలించునా? ఇక్కట్టులన్నియు ధర్మము (యొక్క) బరువు నారయఁ జూచుతూనికఱాళ్లు. దానికొలఁదిఁ దెలియ నుంకించుకొలఁతబద్దలు. ధర్మమో! అవాఙ్మానసగోచరమగు నాపరతత్త్వము స్వరూపము. దాని నెవ్వరు దూఁపఁగలరు? ఎవ్వరు కొలఁదివెట్టఁగలరు? దానికిఁ జలనమేది?

పార్వతీపరమేశ్వరు లావీరుని ధర్మనిష్ఠితబుద్ధికి మెచ్చుకొని, యభీష్టవరముల నొసఁగిరి.

## శ్రీనాథుఁడు.

ధర్మవీరునికథ హారవిలాసకథలలో నొకటి. హారవిలాసమును రచించినమహాకవి శ్రీనాథుఁడు. చిఱుతొండనికథ నీతఁడు పాల్కురికిసోమనాథుని బసవపురాణమునుండి యొకింతమార్పుతోఁ గైకొనియుండును. కాదేని వేఱొకశైవగ్రంథమునుండి గ్రహించియుండును. సోమనాథునిగ్రంథమున సిరియాలుఁడే తనపుత్త్రుని వండించి పెట్టినట్లున్నది. నాచిన్నతనమున వచ్చిన ధార్వాడనాటకులు మొదలగువారు సిరియాలుఁడే కథానాయకుఁడైనట్లు ప్రదర్శించియున్నారు. హారవిలాసమున చిఱుతొండఁడు కథానాయకుఁడైనట్లును సిరియాలుఁడే వండఁబడినట్లును గానంబడియె. ఈమార్పునకుఁ గారణము మృగ్యము. ఈచిఱుతొండనంబిచరిత్రమును, కూచిమంచి తిమ్మకవి భల్లాణచరిత్రమును పేరితో వేఱొకగ్రంథముగా వ్రాసెనని యొకానొకరు వ్రాసియున్నారు గాని అక్కథలు వేఱుగాఁ గన్పట్టుచున్నవి.

శ్రీనాథునకుఁ గవిసార్వభౌముఁడను బిరుదుగలదు. ఈబిరుదము స్వశక్తివలన సంపాదింపఁబడినది గాని మఱియొకటి గాదు. ఇమ్మహాకవి క్రీ. శ. పదునాలవశతాబ్ది కడపటిదశయందును, పదునైదవశతాబ్ది పూర్వార్థమునందును బేరుగాంచినవాఁడు. ఈతనితాత కమలనాభుఁడు ; తండ్రి మారయ ; తల్లి భీమాంబ. ఇతఁడు మంత్రికులతిలకుఁడు. ఈతనిజన్మస్థానము తూర్పుసముద్రతీరముననున్న కాల్పట్టణమని యూహింపఁబడు

చున్నది. ఇది, యిప్పటిగుంటూరుమండలములోని మచిలీపట్ట ణమునకు సమీపమున సముద్రపుటొడ్డుననున్న కాళీపట్టణమను గ్రామమైయుండునని కొందఱును, దీనికి యోజనదూరమున ను న్నకలపటమనుగ్రామమై యుండునని కొందఱును వ్రాసియు న్నారు.అక్కాలమున నీతఁడు తనపాండితీగరిమచేతను, కవితా మహిమచేతను, (అనేకాస్థానములయందు) దిగ్విజయమును నె ఱపి, తుదకుఁ గనకాభిషేకమును, కవిసార్వభౌమబిరుదమును బొందెను.

ఈతఁడు బాల్యముననే కవితాకన్యను జేపట్టినప్రతిభా శాలి. గొప్పవిద్వాంసుఁడు. ఇతఁడు మరుత్తరాట్చరిత్రము, శాలివాహనసప్తశతి, పండితారాధ్యచరిత్రము, శృంగారనైష ధము, హరవిలాసము, భీమేశ్వరపురాణము, శివరాత్రిమాహా త్మ్యము, కాశీఖండము మొదలగు బహుగ్రంథములను రచించె ను. ఆంధ్రకవులలో నిన్నిప్రౌఢగ్రంథములను వ్రాసినకవి మ ఱియొకఁడులేఁడు. ఇతఁడు సర్వతంత్రస్వతంత్రుఁడై యపురూ పములగు ప్రయోగముల ననేకములఁ దనగ్రంథములందుఁ జొ ప్పించెను. అందుఁ గొన్ని యీగ్రంథమునందును గలవు. మచ్చున కొకటి :—

"స్నానముఁజేసి ధౌతపరిధానముఁగట్టి," (చూ. 41పు.)

☞ కూ. తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమున నీపదమునిట్లే యిచ్చియున్నాఁడు. కావున నతనికాలమునను నీపద్య మిట్లే యున్నట్లు తోఁచెడిని.

# రణవీరుఁడు.

పాండవమధ్యముఁడును శూరాగ్రేసరుఁడునునగునర్జునుఁడు భూసంచారము సేయుచు మణిపురము నేలుమకరధ్వజమహారాజపుత్త్రిక యగుచిత్రాంగదను బరిణయమై యామెయందు బభ్రువాహనుఁ డనుకుమారునిఁ గని తనసంచారమును బరిసమాప్తి నొందించుకొన వెడలిపోయెను. మణిపుర రాజునకుఁ బుత్త్రి సంతానములేమి దౌహిత్రుఁడగు బభ్రువాహనుఁడే యప్పాండ్య దేశమునకు రాజై దాని నేలుచుండెను. ఈతఁడే యిందలికథానాయకుఁడు ఈతనియందు ముఖ్యముగా వెలుంగుమహాగుణము క్షాత్త్రము. కురుపాండవయుద్ధానంతరము ధర్మరాజుచేయు నశ్వమేధయాగమునకై అర్జునుఁ డంగరక్షగా విడువఁబడినయశ్వము నీతనిభటులు పట్టిరి.

ఉత్తమక్షత్త్రియులు క్షాత్త్రమునే ప్రధానధర్మముగాఁ బరిగణింతురు. తనయాగాశ్వము పట్టువడిన దనువార్త [illegible]ముని క్షత్త్రియ తేజమును రగులుకొలిపెను. ఆవరోధించినవాఁడు తన తనూజుఁడని యాతఁ డెఱుఁగును. ఎఱిఁగిన నేమి? క్షత్త్రిధర్మానలమునకుఁ బుత్త్రమిత్త్రకళత్రాది సమస్తమును దృణప్రాయము. ఒక్కక్షత్త్రియధర్మమునకే యననేల? ఏధర్మమును బాలించునప్పు డాధర్మమునకవియన్నియు నట్టివే.

తనచేఁ బట్టువడినయశ్వము తనజనకునిదని తెలియగానే బభ్రువాహనుని శోకగ్రావ్పయొప్పమిఁ జేసినట్లయ్యెను. అనేకోపాయనంబులతో నేఁగి 'దేవ! కైతప్పున నీహయము చేరినది. కృ

హామతి నీతప్పు క్షమింపు' మని అర్జునుని పాదయుగళమునఁ బ్రాలెను. ఈకృత్యమర్జునుని క్రోధాగ్నిని బ్రజ్వలింపఁ జేసెను. తనయునిశిరము నట్టైతన్నెను. మఱియు 'ఓరి ! నీవుమావంగడమాటబొంకు. వైశ్యునకుం గనఁబోలు నిన్నుఁ జిత్రాంగద' అనివాక్ప్రహారముం గావించెను. 'వైరి నరపాలకంఠలుంఠనక్రీకచే' మగు నాబభ్రువాహనుఁ డప్పుడు దండతాడితభుజంగమయ్యెను. పితృపాదఘాత మాతనికిఁ బుష్పమేయైనను మాతృదూషణపూర్వకపితృవాక్యాఘాత మాతనికిఁ గొఱవియయ్యెను. పౌరుషవాహినిపొంగి, మానససరస్సులోని పితృగౌరవద్వీపమును ముంచివైచెను.

తండ్రీ కొడుకులగునర్జునబభ్రువాహనులకు జరిగినదారుణరణవర్ణనమే యిందలిప్రధానవస్తువు. క్షత్త్రియరక్తవాహినులిరువురి రక్తనాళములయందును బ్రవహించుచున్నవి. ఇరువురు క్షత్త్రియధర్మమును బాగుగ నెఱుంగుదురు. అది పుత్త్రునియందు నధికతరంబుగ వెలిఁగినది. అనంతరకథ గ్రంథమువలన నెఱుంగఁదగును.

మనరణవీరుని విజయగీతమును భారతీదేవి నేఁటికిని గానముచేయుచునే యున్నది. ఆగానామృతతరంగములలో నెల్లవారును దేలి యాడుచునే యున్నారు.

పి న వీ ర భ ద్రుఁ డు.

రణవీరుఁడగు బభ్రువాహనునిచరితము జైమినిభా

ములోనిది. జైమినిభారతమును తెలిఁగించినకవీంద్రుఁడు పిల్లల మఱ్ఱి పినవీరభద్రుఁడు. ఈతఁడు మంత్రికులశేఖరుఁడు. గాదయామాత్యపుత్త్రుఁడు. ఇతనితల్లి నాగాంబ. పెదవీరన్న యీతనియన్న. ఇతఁడు పదునైదవశతాబ్ది యుత్తరార్ధమునయున్నవాఁడు. ఈతఁడు తనగ్రంథమును సాళువ నరసింహరాజునకుఁ గృతిగా నిచ్చెను.

ఈతనికవిత్వము నిసర్గధారగలదియై, లలితపదబంధురమై, భావపుష్టిగలిగి వినువారివీనులకు విందుగొలుపునదియై యున్నది. రసమును బ్రవహింపఁజేయుటయందును, భావము నుద్రేకింపఁజేయుటయందును, వానికిఁ దగినపదములను గూర్చుటయందును నీతఁ డాదికవులతోఁ బోల్పఁదగియున్నాఁడు. ఇతఁడు శృంగారశాకుంతలము, అవతారదర్పణము, నారదీయము, మాఘమాహాత్మ్యము, మానసోల్లాససారము, పురుషార్థ[illegible] మొదలగుగ్రంథములను రచియించినట్లు తెలియవచ్చుచున్నది.

ఇతనికవిత్వమున 'క్త్వార్థకేకారసంధులు, తత్సమాకారసంధులు, పట్టుక, ఎత్తుక మొదలగురూపములు, గానవచ్చుచున్నవి. ఇవి యితనికంటె మిక్కిలియుఁ బూర్వులయిన రంగనాథాదుల గ్రంథములయందును గానంబడుచున్నవి.

☞ పై వానిలోఁ ఛాత్రిగుణపోషణాదివిషయము లనేకములు గ్రంథవిస్తరభీతిని సంక్షేపింపఁబడినవి.

న. వీ.

## విషయసూచిక.

# పరమహిమ

## దానవీరుఁడు.



( బలిచక్రవర్తి. )

క. శ్రీమన్నాను పయోద
శ్యామ ధరాభృల్లలామ జగదభిరామా
రామాజనకామ మహో
ద్దామ గుణస్తోమధామ దశరథరామా. 1

వ. మహనీయగుణగరిష్ఠు లగునమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుం డైనసూతుం డిట్లనియె నట్లుప్రాయోపవిష్టుం డైనపరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని.

మ. బలి నంభోరుహనేత్రుఁ డేమిటికినై పాదత్రయిన్ వేఁడెని
ర్మలుఁడున్ బూర్ణుఁడులబ్ధకాముఁడురమాసంపన్నుఁడై తాఁబర
స్థలికిన్ దీనునిమాడ్కి నేలచనియెం దప్పేమియున్ లేక ని
ష్కలుషున్ బంధనమేలచేసెనువినంగౌతూహలంబయ్యెడిన్.

వ. అనిన శుకుం డిట్లనియె. 4

సీ. పురుహూతుచే నొచ్చి పోయి భార్గవులచే
బలి యెట్టకేలకు బ్రదికి వారి

# పరమహిమ

## దానవీరుఁడు.



( బలిచక్రవర్తి. )

క. శ్రీమన్నామ పయోద
శ్యామ ధరాభృల్లలామ జగదభిరామా
రామాజనకామ మహో
ద్దామ గుణస్తోమధామ దశరథ రామా. 1

వ. మహనీయగుణగరిష్ఠు లగునమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుం డైనసూతుం డిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుం డైనపరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని.

మ. బలి నంభోరుహనేత్రుఁ డేమిటికినై పాదత్రయిన్ వేఁడెని
శ్చలుఁడున్ బూర్ణుఁడులబ్ధకాముఁడురమాసంపన్నుఁడై తాఁబర
స్థలికిన్ దీనునిమాడ్కి నేలచనియెం దప్పేమియున్ లేక ని
ష్కలుషున్ బంధనమేలచేసెనువినంగౌతూహలంబయ్యెడిన్.

వ. అనిన శుకుం డిట్లనియె. 4

సీ. పురుహూతుచే నొచ్చి పోయి భార్గవులచే
బలి యెట్టకేలకు బ్రదికి వారి

వివర్జిత యగు దేవధాని నధిష్ఠించి జగత్త్రియంబునుం దన వశంబు సేసికొని విశ్వవిజయుండై పెద్దకాలంబు రాజ్యంబు సేయుచుండె శిష్యవత్సలు లగుభృగ్వాదు లతనిచేత శతాశ్వమేధంబులు సేయించిరి తత్కాలంబున. 9

శా. అర్థుల్ వేఁడరు దాతలుం జెడరు సర్వారంభముల్ పండుఁబ్రి
త్యర్థుల్ లేరు మహోత్సవంబులను దేవాగారముల్ వొల్చుఁబూ
ర్ణార్థుల్ విప్రులు వర్షముల్ గురియుఁగాలార్హంబులై ధాత్రికిన్
సార్థంబయ్యె వసుంధరాత్వమసురేంద్రాధీశు రాజ్యంబునన్.

వ. అంత. 11

సీ. తనతనూజులప్రోలు దనుజులు గొనుటయు
వేల్పులెల్లను డాఁగ వెడలుటయును
భావించి సురమాత పరితాపమునఁ బొంది
వగ ననాథాకృతి వనరుచుండ
నాయమ పెనిమిటి యగుకశ్యపబ్రహ్మ
మఱియొకనాఁడు సమాధి మాని
తనకుటుంబిని యున్న ధామంబునకు నేఁగి
నాతిచే విహితార్చనములు వడసి

ఆ. వంది వాఁ్రిలి కుంది వాడినయిల్లాలి
వదనవారిజంబు వడువుఁ జూచి
చేరఁ దిగిచి మగువ చిబుకంబు పుడుకుచు
వారిజాక్షి యేల వగచె దనిన. 12

వ. పతికి సతి యిట్లనియె.

సీ. ఎండకన్నెఱుఁగని యింద్రునియిల్లాలు
పలుపంచలను జాలిఁబడియె నేఁడు
త్రిభువనసామ్రాజ్య విభవంబుఁ గోల్పోయి
దేవేంద్రుఁ డడవులఁ దిరిగె నేఁడు
గలిమి గారాబుబిడ్డలు జయంతాదులు
శబరార్భకులవెంటఁ జనిరి నేఁడు
నమరుల కాధారమగునమరావతి
యసురుల కాటపట్టయ్యె నేఁడు
ఆ. బలి జగములనెల్ల బలియుఁడై యున్నాఁడు
వాని గెలువరాదు వాసవునకు
యాగభాగమెల్ల వడిఁ దాహరించును
గడఁగి సురలకొక్క కడియు లేదు. 14

మ. సుతలక్ష్మ సభ్యుల నార్తులన్ విరథులన్ శోకంబువారించి ని
ర్జరధానిన్ నిలువంగ రాత్రిచరులన్ శాసింపసత్కార్య మే
వెరవేరీతిఘటిల్లు నట్టికార్యమున్ వేవేగచింతింపవే
కరుణాలోకసుధాఝురిం దనుపవే కల్యాణసంధాయకా. 15

వ. అనిన మనోవల్లభపలుకులాకర్ణించి ముహూర్తమాత్రంబు
చింతించి కశ్యపప్రజాపతి సతికిఁ బయోభక్షణం బను వ్రతం
బుపదేశించిన, నదితియు హరిసమర్పణంబుగా వ్రతంబు నేసి
వ్రతాంతంబున నియతయై యున్న యెడఁ జతుర్బాహుఁడును

పీతవాసుండును శంఖచక్రగదాధరుండును నై నేత్రంబుల క
గోచరుండై ననారాయణదేవుండు ప్రత్యక్షుండై నంగనుంగాని

క. చూపుల శ్రీపతిరూపము
నాపోవక త్రావితావి హర్షోద్ధతయై
వాపుచ్చి మందమధురా
లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్. 17

ఆ. అసురవరులు సురల నదలించి బెదరించి
నాకమేలుచున్న నాఁటనుండి
కన్నకడుపుగాన కంటఁ గూరుకు రాదు
కడుపుఁబొక్కు మాన్పి కావవయ్య. 18

వ. అనిన విని దరహాసితవదనుం డయి యాశ్రితకామధేను
వైన యప్పరమేశ్వరుం డిట్లనియె. 19

క. నీరమణుని సేవింపుము
నారూపము నుపాసించి నలి నీగర్భా
గారంబు వచ్చి చొచ్చెద
గారవమునఁ బెంపవమ్మ కరుణన్ నన్నున్. 20

క. ఏలింతు దివము సురలను
బాలింతు మహేంద్రియువతి భాగ్యశ్రీలం
దూలింతు దానవుల ని
ర్మూలింతు రిపుప్రియాంగముల భూషణముల్. 21

వ. అని యిట్లు భక్తజనపరతంత్రుం డగునారాయణుండు దా

నతిచ్చి యొక్క దినంబున.

22
మ. రవి మధ్యాహ్నమునంజరింపగ్రహతారాచంద్రభద్రస్థితిన్
శ్రవణాఖ్యాదశినాఁడు శ్రోణ నభిజిత్సంజ్ఞాతలగ్నంబునన్
భువనాధీశుఁడు పుట్టె వామనగతిం బుణ్యవ్రతోపేతకున్
దివిజాధీశ్వరు మాతకుం బరమపాతివ్రత్యవిఖ్యాతకున్. 23

వ. మఱియు నద్దేవుండు శంఖచక్రగదాకమలకలితచతుర్భుజుం
డై యవతరించిన సమయంబున

24
శా. చింతంబాసిరి యక్షతార్క్ష్యసుమనస్సిద్ధోరగాధీశ్వరుల్
సంతోషించిరి సాధ్యచారణమునీశబ్రహ్మవిద్యాధరుల్
గాంతిం జెందిరి భానుచంద్రములు రంగద్గీతవాద్యంబులన్
గంతుల్ వైచిరిమింటఁగింపురుషులున్గంధర్వులుంగిన్నరుల్

వ. అంత నవ్విభుండు సాయుధసాలంకారం బగుతనదివ్యరూపం
బు నుజ్జగించి రూపాంతరం బంగీకరించి కపటవటునిచందం
బున నుపనయనవయస్కుండైనబాలకుండై తల్లిముందట
సముచితాలాపంబు లాడుచుఁ గ్రీడించుచున్న నబ్బాలునకు
సంతసంబున మహర్షులు గశ్యపప్రజాపతిం బురస్కరించు
కొని సముచితోపనయనకర్మకలాపంబులు సేయించిరి సవిత
సావిత్రి నుపదేశించె బృహస్పతి యజ్ఞోపవీతంబును గశ్య
పుండు ముంజియుఁ గౌపీనంబదితియు ధరణి కృష్ణాజినంబును
దండంబు వనస్పతియగుసోముండును గగనాధిష్ఠానదేవత
ఛత్త్రంబును గమండలువు బ్రహ్మయు సరస్వతి యక్షమా

లికయు సప్తర్షులు గుశపవిత్రింబులు నిచ్చిరి మఱియును.

క. భిక్షాపాత్రిక నిచ్చెను
యక్షేశుఁడు వామనునకు నక్షయమనుచున్
సాక్షాత్కరించి పెట్టెను
భిక్షునకు భవాని పూర్ణభిక్ష నరేంద్రా. 27

వ. ఇట్లు కృతకృత్యుం డై నమాయామాణవకుండు దేశాంతర సమాగతులగు బ్రాహ్మణులం గొందఱనవలోకించియిట్లనియె.

క. వత్తురె విప్రులు వేఁడఁగ
నిత్తురె దాతలును వేడ్క నిష్టార్థములం
దెత్తురె మీరును సంపద
లిత్తెఱఁగున దానవీరుఁ డెవ్వఁడొ సెప్పుఁడా. 29

వ. అనిన నఖిలదేశీయు లగుభూసురు లిట్లనిరి. 30

మ. కలరున్దాతలునిత్తురున్ధనములుంగామ్యార్థముల్గొంచువి
ప్రులు నేతెంతురుగానియీవినిబలింబోలన్వదాన్యుండులేఁ
డలఘుండై యొసరించె నధ్వరశతం బాభార్గవానుజ్ఞచే
బలి వేఁడంబడయంగవచ్చుబహుసంపల్లాభముల్వామనా.

వ. అని తెలియంజెప్పిన బ్రాహ్మణులవచనంబు లాలకించిలోకం బులకుం బ్రీతిపుట్టింపఁ బయనంబై లాభవచనంబులు గైకొనుచుఁ దల్లిదండ్రులవీడ్కొనిశుభముహూర్తంబునంగదలి.

క. పరిక్షీణాదివిజవల్లభ
రక్షాపరతంత్రుఁడగుచు రాజీవాక్షుం

ఘాతుకణమున బలియింటికి
భిక్షాగమనంబు సేసెఁ బేదఱికముతోఁ. 33

వ. ఇట్లు నని చని నర్మదఁ దరించి తత్ప్రవాహంబున కుత్తర తటంబునందు. 34

శా. చండస్ఫూర్తివటుండుగాంచెబహుధాజల్పన్నిశాటంబును
ద్దండాహూతమునీభ్యబిభ్యదమృతాంధస్సిద్ధకూటంబు వే
దండాశ్వధ్వజినీకవాటము మహోద్యద్ధూమసంఛన్నమా
ర్తాండస్యందనఘోటమున్ బలిమఖాంతర్వేదికావాటమున్.

వ. కని దానవేంద్రునివాయమేఘవాటి దఱియం జొచ్చునయ్యవసరంబున. 36

శా. శంభుండో హరియో పయోజభవుఁడో చండాంశుఁడో వహ్ని
దంభాకారత వచ్చెఁగాక ధరణిన్ ధాత్రీసురుం డెవ్వఁడీ[యో
శుంభద్యోతనుఁ డీమనోజ్ఞతనుఁడంచున్ విస్మయభ్రాంతులై
సంభాషించిరి బ్రహ్మచారిఁ గని తత్సభ్యుల్ రహస్యంబుగన్.

వ. ఆసమయంబున బలిసభామండపంబుఁ దఱియం జొచ్చి.

సీ. చవులుగాఁ జెవులకు సామగానంబులు
సదువునుద్గాతల చదువులిమచు
మంత్రతంత్రార్థసంబంధభావములు వే
రొక్కనెడిహోతలతోడఁ గూడికొనుచు
హోమకుండంబులం దున్న త్రేతాగ్నుల
వెలిఁగించుచుఁబూజకవితతిఁగనుచు

దత్తుత్రై బహువిధాధ్వరవిధానంబులు
సెప్పెదుసభ్యులఁ జేరఁజనుచు

తే. బెట్టుగోరెడువేడుక పట్టువఱుచు
నదితిపుట్టువు లచ్చికి నాటపట్టు
గోరి చరియించె సభలోనఁ గొంతదడవు
పుట్టువెన్నఁడు నెఱుఁగని పొట్టివడుగు. 39

వ. మఱియును. 40

క. వెఱచుచు వంగుచు వ్రాలుచు
నఱిముఱి గుబురులకుఁ జనుచు హరిహరి యనుచున్
మఱుఁగుచు నులుకుచు దిరదిరఁ
గుఱుమట్టపుఁ బొట్టివడుగు గొంతనటించెన్. 41

క. కొందఱతోఁ జర్చించును
గొందఱతో జటలు సెప్పు గోష్ఠిం జేయుం
గొందఱతోఁ దర్కించును
గొందఱతో ముచ్చటాడుఁ గొందఱ నవ్వున్. 42

వ. మఱియుననేకవిధంబులనందఱకునన్నిరూపులై వినోదించుచు

క. వెడవెడనడకలు నడచుచు
నెడనెడ నడుగిడఁగ నదరి యిల దిగఁబడఁగా
బుడిబుడినొడువులు నొడువుచుఁ
జడిముడి తడఁబడఁగ వడుగు సేరెన్ రాజున్. 44

వ. ఇట్లుడగ్గఱిమహామహాభిక్షుకుండు రక్షోవల్లభుంజూచి యిట్లనియె.

మ. ఇతఁడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్ని కాలాదిది
క్పతిగర్వాపనయప్రవర్తి గతలోభస్ఫూర్తి నానామఖ
వ్రతదానప్రవణానువర్తి సుమనోరామామనోభేదనో
ద్ధతచంద్రాతపకీర్తి సత్యకరుణాధర్మోల్లసన్మూర్తి దాన్. 46

వ. అనికుశపవిత్రాక్షతసంయుతం బగుదక్షిణహస్తంబు సాఁచి యిట్లనియె. 47

ఉ. స్వస్తి జగత్త్రయీభువన శాసకర్తకు హాసమాత్రవి
ధ్వస్తనిలింపభర్తకు నుదారపదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుతమంగళాధ్వర విధానవిహర్తకు నిర్జరీగళ
న్యస్తసువర్ణసూత్రపరిహర్తకు దానవలోకభర్తకున్. 48

వ. అనిదీవించి కరచరణాద్యవయవంబులుధరియించినవేదరాశి యుంబోలె ముందట నకుటిలుండును జటిలుండును సదండఛత్త్రుండునుగకులంబితభిక్షాపాత్రుండునుగరకలితజలకమండలుండును మనోహరవదన చంద్రమండలుండును మాయావాదనపటువునునగువటువుం గని దినకరకిరణపిహితంబులైన గ్రహంబుల చందంబునఁ దిరోహితులై భృగువులు గూర్చున్నయెడల లేచి సేమం బడిగి తియ్యనిమాటల నాదరించిరి బలియును నమస్కరించి తగినగద్దియ నునిచి పాదంబులుదుడిచి తనప్రాణవల్లభ పసిండికలశంబున నుదకంబులు వోయ వడుగుకొమరునిచరణంబులుగడిగితడియొత్తి తత్సమయంబున.

ఆ. వటునిపాదశౌచవారి శిరంబునఁ

పరమభద్రమనుచు బలి వహించె
నేజలము గిరీశుఁ డిందుజూటుఁడు దేవ
దేవుఁ డుద్వహించె ధృతి శిరమున. 50

వ. మఱియు నయ్యజమానుం డభ్యాగతున కిట్లనియె. 51

మ. వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సంవాసస్థలం బెయ్య ది
య్యెడకున్ నీవరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మముం
గడు ధన్యాత్ముఁడనైతి నీమఖముయోగ్యంబయ్యె నాకోరికల్
గడ తేఱెన్ సుహుతంబులయ్యె శిఖులుం గల్యాణమిక్కాలమున్.

మ. వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హరులో రత్నములో రథంబులొ విశిష్టార్థంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీఖండమొ కాక యేమడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా.

వ. అని ధర్మయుక్తంబుగాఁ బలికిన వైరోచనివచనంబులు విని
సంతోషించి యీశ్వరుం డిట్లనియె. 54

సీ. ఇది నాకు నెలవని యేమని పలుకుదు
నొకచో టనక యెందు నుండనేర్తు
నెవ్వనివాఁడ నంచేమని పలుకుదు
నాయంతవాఁడనై నడవనేర్తు
నీనడవడి యని యెట్లు వక్కాణింతుఁ
బూని ముప్పోకలఁ బోవనేర్తు
నదినేర్తు నిదినేర్తు నని యేల చెప్పంగ

నేరుపులన్నియు నేన నేర్తు
ఆ. నొరులుగారు నాకు నొరులకు నేనాదు
నొంటివాఁడఁ జుట్టు మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లిగలదు చెప్పెద నాకెంకి
సుజనులందుఁ దఱచు సాచ్చియుండు. 55
వ. అది యట్లుండనిమ్ము. 56
సీ. జననాథ నీమాట సత్యంబు సత్కీర్తి
దంబుఁ గులార్హంబు ధర్మయుతముఁ
గరుణానువర్తులు ఘనసత్త్వమూర్తులు
గాని మీకులమందుఁ గలుగ రొరులు
రణభీరువులు వితరణభీరువులు లేరు
ప్రత్యర్థు లర్థులు ప్రబ్బికొనిన
దానశౌండు లగుచుఁ దనువుమ రథికులై
మీతాత లందఱు మేటిమగలు
ఆ. మీకులంబునందు మెఱయుఁ బ్రహ్లాదుండు
మింటిచంద్రుమాడ్కి మేలిరుచులఁ
బ్రథితకీర్తితోడ భవదీయవంశంబు
నీరరాశిభంగి నెగడుచుండు. 57
క. ఆతురభూసురగతిఁ బురు
హూతాదులు దన్ను వేఁడ నొగిఁ గొమ్మనుచున్
మీతండ్రి యిచ్చె నాయువు

నేతన్మాత్రుఁడవె. నీవు నీలోకమునన్. 58

క. ఏలితివి మూఁడుజగములుఁ
దోలితి వింద్రాదిసురులఁ దొల్లిటివారిం
బోలితివి దానగుణముల
సోలితివి పిశాచరాక్షసుల రక్షింపన్. 59

వ. అదియునుంగాక. 60

క. రాజ్యంబు గలిగెనేనియుఁ
బూజ్యులకును యాచకులకు భూమిసురులకున్
భాజ్యముగ బ్రదుకఁడేనిం
ద్యాజ్యంబులు వానిజన్మధనగేహంబుల్. 61

క. ము న్నెన్నదురు వదాన్యుల
నెన్నడుచో నిన్నుఁ ద్రిభువనేశుం డనుచు
న్నిన్నిదినంబులనుండియు
నెన్నఁడు నినుఁ బెట్టుమనుచు నింద్రముసేయన్. 62

ఆ. ఒంటివాఁడ నాకు నొకటి రెండడుగుల
మేర యిమ్ము సామ్ము మేర యొల్లఁ
గోర్కిదీర బ్రహ్మాండ మొకటి ముట్టెద
దానకుతుకసాంద్ర దానవేంద్ర. 63

వ. అనినఁ బరమయాచకునకుఁ బ్రదాత యిట్లనియె. 64

ఆ. ఉన్నమాటలెల్ల నొప్పును విప్రుండ
సత్యగతులు వృద్ధసమ్మతంబు

లడుగఁదలఁచి కొంచె మడిగితివో చెల్ల
దాత పెంపుసొంపుఁ దలఁపవలదె. 65

మ. వసుధాఖండము వేఁడితో గజములన్ వాంఛించితో వాజులన్
వెసనూహించితొ కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో
పసిబాలుండవు నేర వీవడుగ నీభాగ్యంబు లీపాటిగా
కసురేంద్రుండు పదత్రయం బడుగ నీయల్పంబు నీనేర్పు నే.

వ. అనిన మొగంబునం జిఱునగవు మొలకలొత్త గృహమేధికి
మేధావి యిట్లనియె. [మో

మ. గొడుగో జన్నిదమో కమండలువొ నాకున్ ముంజియో దండ
వడు గే నెక్కడ భూములెక్కడ కరుల్ వామాక్షులశ్వంబు లె
క్కడ నిత్యోచితకర్మ మెక్కడ మదాకాంక్షా మితంబైన మూఁ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చుట దిబ్రహ్మాండంబు నాపాలికిన్.

వ. అదియునుంగాక. 69

క. వ్యాప్తిం బొందక వగవక
ప్రాప్తంబగులేశమైనఁ బదివేలనుచుం
దృప్తిం జెందని మనుజుఁడు
సప్తద్వీపముల నయినఁ జక్కంబడునే. 70

శా. ఆశాపాశము దాఁగడున్ నిడుపు లేదంతంబు రాజేంద్రవా
రాశిప్రావృతమేదినీవలయ సామ్రాజ్యంబు సేకూడియుం
గాసిం బొందిరిగాక వైన్యగయభూకాంతాదులు స్వార్థకా
మాశన్ బాయఁగ నేర్చి రే మునునిజాశాంతంబులం జూచిరే.

సీ. సంతుష్టుఁ డీమూఁడుజగములఁ బూజ్యుండు
సంతోషి కెప్పుడు జరగుసుఖము
సంతోషి గాకుంట సంసారహేతువు
సంతసంబున ముక్తి సతియుదొరకుఁ
బూఁటపూఁటకు జగంబుల యదృచ్ఛాలాభ
తుష్టిని దేజంబు దోనపెరుఁగుఁ
బరితోషహీనతఁ బ్రభ సెడిపోవును
జలధార ననలంబు సమయునట్లు
ఆ. నీవు రాజవనుచు నిఖిలంబు నడుగుట
దగవుగాదు నాకుఁ దగినకొలఁది
యేను వేఁడికొనిన యీపదత్రయమును
జాలదనక యిమ్ము చాలుఁ జాలు. 72

వ. ఇట్లు పలుకుచున్నఖర్వునకు నుర్వీశ్వరుం డుర్వీదానంబు
సేయందలంచి కరకలితసలిలకలశుండైన నవ్వితరణగుణము
ఖరునిం గని నిజవిచారయుక్తదనుజ రాజ్యచక్రిం డగుశు
క్రుండిట్లనియె. 73

సీ. దనుజేంద్ర యీతఁడు ధరణీసురుఁడు గాఁడు
దేవకార్యంబు సాధించుకొఱకు
హరి విష్ణుఁ డవ్యయుం డదితిగర్భంబునఁ
గశ్యపసూనుఁడై కలిగె నకట
యెఱుఁగ కీతనికోర్కి నిచ్చెద నంటివి

దైత్యసంతతి కుపద్రవము వచ్చు
నీలక్ష్మి దేజంబు నెలవు నైశ్వర్యంబు
వంచించి యిచ్చుఁ దా వాసవునకు

ఆ. మొనసి జగములెల్ల మూఁడుపాదంబుల
నఖిలకాయుఁడగుచు నాక్రమించు
సర్వధనము విష్ణుసంతర్పణముసేసి
బడుగుపగిది నెట్లు బ్రదికెదీవు. 74

క. ఒక్కపదంబున భూమియు
నొక్కటఁ ద్రిదివంబుఁ ద్రొక్కి యున్నతమూర్తిన్
దిక్కులు గగనముఁ దానై
పెక్కసమై యున్న నెందువెడలెదు చెపుమా. 75

సీ. ఇచ్చెద ననిపల్కి యీకున్న నరకంబు
ద్రోవ నీవును సమర్థుఁడవు గాన
యేదానమున నాశ మేతెంచునదియును
దానంబు గాదండ్రు తత్త్వవిదులు
దానంబు యజ్ఞంబుఁ దపముఁ గర్మంబును
దా విత్తవంతుఁడై తలఁపవలయుఁ
దనయింటఁ గలసర్వధనమును నైదుభా
గములుగా విభజించి కామమునకు

ఆ. నర్థమునకు ధర్మయశములకు కాశ్రిత
బృందములకు సమతఁ బెట్టునట్టి

పురుషుఁ డింతు నందుఁ బూర్ణుఁడై మోదించుఁ
దన్ను మాని చేఁత దగవుగాదు. 76

వ. అదియునుంగాక యీయర్థంబునందు బహుభంగి బహ్వృచ
గీతార్థంబు గలదొక్కటి సావధానుండవై యాకర్ణింపుము.

సీ. అంగీకరించిన నఖిలంబుఁ బోవుచో
నన్నృతంబు గాదు లేదనిన నధిప
యాత్మ వృక్షము మూల మన్నృతంబు నిశ్చయ
మనృతమూలముగల్గ నాత్మ సెడదు
పుష్పఫలము లాత్మభూజంబునకు సత్య
మాగ్రమాను బ్రదుకమి నదియుఁజెడును
ఫలపుష్పములులేక పససెడి వృక్షంబు
మూలంబుతోఁ వృద్ధిఁ బొందుఁగాదె

తే. చేటుఁ గొఱఁతయు లఘిమయుఁ జెందకుండ
నిచ్చుపురుషుండు సెడకుండు నిద్ధచరిత
కాక నంచితసత్యసంగతి నటించు
నిజధనం బర్థికిచ్చిన నీకు లేదు. 78

ఆ. సర్వమయినచోట సర్వధనంబులు
నడుగ లేదటంచు నన్నృతమాడు
చెనఁటిపంద నేమిసెప్పఁ బ్రాణముతోడి
శవము వాఁడు వాని జన్మమేల. 79

వ. మఱియు నొక్కవిశేషంబు గలదు వివరించెద. 80

ఆ. వారిజాక్షులందు వైవాహికములందుఁ
బ్రాణవిత్తమాన భంగములను
జకితగోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము వొందఁ డనెప. [రుం
మ. కులమున్ రాజ్యముఁ దేజమున్ నిలుపుమీకుబ్జుండు విశ్వంభ
డలఁతింబోఁడు త్రివిక్రమస్ఫురణవాఁడై నిండుబ్రహ్మాండముం
గలఁడే మాన్పనొకండు నాపలుకు లాకర్ణింపు కర్ణంబులన్
వల దీదానము గీనముంబనుపుమా వర్ణిన్ వదాన్యోత్తమా.
వ. అని యిట్లు హితంబు పలుకుచున్న కులాచార్యునకు క్షణ
మాత్ర నిమీలితలోచనుండయి యశస్వి యిట్లనియె. 83
సీ. నిజ మానతిచ్చితి నీవు మహాత్మక
మహిని గృహస్థధర్మంబు నిదియు
నర్థంబుఁ గామంబు యశమును వృత్తియు
నెయ్యది ప్రార్థింప నిత్తు ననియు
నర్థలోభంబున నర్థిఁ బొమ్మను టెట్లు
పలికి లేదనుకంటెఁ బాప మెద్ది
యెట్టిదుష్కర్ముని నే భరించెదఁగాని
సత్యహీనుని మోవఁ జాలననుచుఁ
తే. బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ
సమరముననుండి తిరుగక చచ్చుకంటెఁ
బలికి బొంకక నిజమునఁ బరఁగుకంటె

మానధనులకు భద్రంబు మఱియుఁ గలదె. 84

క. ధాత్రిని హాలికునకును సు
క్షేత్రము బీజములు నొకటఁ జేకుఱుభంగిం
జిత్రముగ దాత కీవియుఁ
బాత్రము సమకూరునట్టి భాగ్యము గలదే. 85

శా. కారే రాజులు రాజ్యముల్ గలుగవేగర్వోన్నతింబొందరే
వా రేరీ సిరి మూటగట్టికొని పోవంజాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరేకోర్కులువారలన్ మఱచిరేయికాలమున్ భార్గవా.

క. ఉడుగనిక్రతువుల వ్రతములఁ
బొడగనఁ జననట్టిపొడవె పొడవునఁ గుఱుచై
యడిగెడి నేఁట నను బోఁటికి
నిడరాదె మహానుభావ యిష్టార్థంబుల్. 87

శా. ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందుకరంబుగ్రిందగుటమీఁదై నాకరంబుంటమేల్
గాదే రాజ్యముగీజ్యమున్ సతతమే కాయంబునాపాయమే.

మ. నిరయంబైన నిబంధమైన ధరణీనిర్మూలనంబైన దు
ర్మరణంబైన గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ముపో
హరుఁడైనన్ హరియైన నీరజభవుం డభ్యాగతుండైన నాఁ
దిరుగన్ నేరదు నాదుజిహ్వ వినుమా ధీవర్య వేయేటికిన్.

ఆ. నొడివినంతవట్టు నెఱపక యిచ్చుచో
నేల కట్టు విష్ణుఁ డేటిమాట
గట్టెనేనిఁ దాన కరుణించి విడుచును
విడువకుండ నిమ్ము విమలచరిత. 90

క. మేరువు దలక్రిందైనను
బారావారంబు లింకఁ బాఱిన లోలో
ధారుణి రజమై పోయినఁ
దారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్. 91

మత్తకోకిల. ఎన్నఁడుంబరువేఁడఁబోఁడఁట యేకలుండఁట కన్నవా
రన్నదమ్ములునైన లేరఁట యన్నివిద్యలమూలగో
ష్ఠి న్నెఱింగిన ప్రోడగు జ్జఁట చేతులొగ్గి వసింప నీ
చిన్నిపాపనిఁద్రోసిపుచ్చఁగఁజిత్తమొల్లదుసత్తమా

వ. అని యిట్లు సత్యపదవీప్రమాణతత్పరుండును వితరణకుతూహలసత్త్వరుండును విమలయశస్కుండును దృఢమనస్కుండును నియతసత్యసంధుండును నర్థిజనకమలబంధుండును నైనబలింజూచి శుక్రుండు గోపించి మదీయశాసనం బతిక్రమించితివి గావున శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుండవు గమ్మని శాపంబిచ్చె బలియును గురుశాపతప్తుండయ్యు నన్నృతమార్గంబున కభిముఖుండు గాకుండె నప్పుడు. 93

ఆ. దనుజలోకనాథు దయిత వింధ్యావళి
రాజవదన మదమరాళగమన

వటుని కాళ్లు గడుగ వరహేమఘటమున
జలము దెచ్చె భర్త సన్నయెఱిఁగి. 94

వ. అయ్యవసరంబునఁ గపటవటునకు నద్దానవేంద్రుండిట్లనియె.

క. రమ్మా మాణవకోత్తమ
తెమ్మా నీవాంఛితంబు లేదన కిత్తుం
దెమ్మా యడుగుల నిటురా
నిమ్మా కడుగంగవలయు నేటికిఁ దడయన్. 96

వ. అనిన విని. 97

మ. బలిదైత్యేంద్రకరద్వయీకృతజల ప్రక్షాళనవ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు సాఁచె యోగిసుమనస్సంప్రార్థితశ్రీపదముం
గలితానమ్రసమాలలాటపదవీ కస్తూరికాశాదమున్
నలినామోదము రత్ననూపురిత నానావేదముం బాదమున్.

క. సురలోకసముద్ధరణము
నిరతశ్రీకరణ మఖిలనిగమాంతాలం
కరణము భవసంహారణము
హరిచరణము నీటఁగడిగె నసురోత్తముఁడుకా. 99

వ. ఇట్లు ధరణీసురదక్షిణచరణప్రక్షాళనంబు సేసి వామపాదం
బు గడిగి తత్పావనజలంబు శిరంబునం జల్లుకొని వార్చి దే
శకాలాదిపరిగణనంబు సేసి. 100

శా. విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్యవిదే త్రిపాదధరణిం దాస్యామియంచుంగ్రియా

షిప్రింపై దనుజేశ్వరుండు వటుగుం జేసాఁచి పూజించిబ్ర
హ్మాప్రీతమ్మని ధారవోసె భువనం బాశ్చర్యముం బొందఁగన్.

వ. తత్కాలంబున. 102

ఆ. నీరధారఁ బడఁగ నీక యడ్డంబుగాఁ
గలశరంధ్రి మాఁపఁగాను దెలిసి
హరియుఁ గావ్యునేత్ర మటఁ గుశాగ్రంబున
నడుచ నేకనేత్రుఁ డయ్యె నతఁడు. 103

వ. అంత. 104

క. మునిజననియమాధారను
జనితాసురపతిసునేత్రజలకణధారన్
దనుజేంద్రనీరధారను
వనజాక్షుఁడు గొనియె బలివివర్ధితధారణ. 105

ఆ. కమలనాభు నెఱిఁగి కాలంబు దేశంబు
నెఱిఁగి శుక్రుమాట లెఱిఁగి నాశ
మెఱిఁగి పాత్రమనుచు నిచ్చె దానము బలి
మహిమవదాన్యుఁ డొరుఁడు మఱియుఁ గలఁడె. 106

క. బలి సేసినదానమునకు
నలినాక్షుఁడు నిఖిలభూత నాయకుఁ డగుటం
గలకలమని దశదిక్కులు
బళిబళియని పొగడె భూత పంచకమనఘా. 107

వ. ఇట్లు ధారాపరిగ్రహంబు సేసి. 108

శా. ఇంతింతై వటుఁ డింతయై మఱియుఁ దానింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున నల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రునికంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై. 109

మ. రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దాఁ బ్రహ్మాండమున్ నిండుచోన్.

వ. ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకంబగు విశ్వరూపంబు ధరియించి భువియును నభంబును దినంబును దిశలును దిశాఛిద్రంబులును సముద్రంబులును జలదఖిలభూతనివహంబులుం దానయై యేకీభవించి బ్రహ్మాండంబు దన మేనికప్పు తెఱంగున నుండ విజృంభించి. 111

మ. ఒకపాదంబున భూమిఁ గప్పి దివి వేఱొంటన్ నిరోధించి యొం డొకటన్ మీఁది జగంబులెల్ల వడి నొండొంటిన్ విలంఘించి పట్టక బ్రహ్మాండకటాహముం బగిలి వేండ్రంబై పరుల్ గానరాకొకఁడై వార్ధ్రుగలభ్యుఁడై హరివిభుండొప్పారె విశ్వాకృతిన్.

వ. తత్సమయంబున.

క. అన్నిజగంబులఁ దానై
యున్న జగన్నాథుఁ జూచి యొగి భావింపం
గన్నందక మనమందక

సన్నుతులం జేసి రవుడు సభ్యులు బలియున్. 114

వ. అంత నాయ్యనపూర్వప్రకారంబునవామనాకారంబువహిం చియున్న వామనునిం గని పదత్రియవ్యాజంబున నితండు సకలమహీమండలంబువాక్రమించెఁ గపటవటురూపతిరోహితుం డగువిష్ణుండని యెఱుంగకమనదానవేంద్రుండుసత్యసంధుండు గావున మాట దిరుగక యిచ్చె నతనివలననేరంబులేదీకుబ్జుండపత్రిహత తేజఃప్రభావంబునసజ్జకంబుగానిజ్జగంబులం బరిగ్రహించి పర్జన్యాదులకు విసర్జనంబుసేయందలంచియున్నవాఁ డీవటునిం దూఱి పాఱనీక నిర్జించుటకర్జంబని తర్జనంబులును గర్జనంబులును జేయుచు వజ్రాయుధాదిమరుజ్జేత లగు హేతిప్రహేతిచిత్తిముఖ్యు లయినరక్కసులు పెక్కండ్రుక్కుమిగిలియుద్ధంబునకుసన్నద్ధులై పరశుపట్టిసభల్లాదిసాధనంబులు ధరియించి కసిమసంగిముసిరికొనిదశదిశలం బ్రసరించినం జూచి హరిపరిచరులు సునందనందజయజయంతవిజయప్రబలోద్బల కుముద కుముదాక్షతార్క్ష్యపుష్పదంతవిష్వక్సేనశ్రుతదేవసాత్వతప్రముఖులగుదండనాథులయుతవేదండ సముద్దండబలులు దమతమయూథంబులనాయుధంబులతోడంగూర్చుకొనిదానవానీకంబులఁ బరలోకంబున కనుచువారలై వారలనెదుర్కొని కదనంబునకున్ బరవసంబు సేయుచున్నంగనుంగొని శుక్రశాపంబుఁదలంచి దనుజవల్లభుం డిట్లనియె. 115

సీ. రాక్షసోత్తములార రంతు పోరాడక
కాలంబు గాదిది కలహమునకు
సర్వభూతములకు సంపదాపదలకుఁ
బ్రభువైన దైవంబుఁ బరిభవింప
మన మోపుదుమె తొల్లి మనకు రాజ్యంబును
సురలకు నాశంబు సొరిదినిచ్చి
విపరీతముగఁ జేయువేల్పు నేమందము
మనపాలిభాగ్యంబు మహిమగాక
తే. వెఱచి పలుమఱు బాఱెడి విష్ణుభటులు
మిమ్ము నొగచుట దైవంబు మేరగాదె
మనకు నెప్పుడు దైవంబు మంచిదగును
నాఁడు గెలుతము పగవారి నేఁడు వలదు. 116

వ. అదియునుంగాక. 117

క. బలుదుర్గంబులు సచివులు
బలములు మంత్రౌషధములు బహుకోశములుం
గలిగియు సామోపాయం
బులఁ గాల మెఱింగి నృపుఁడు పోరుట యొప్పున్. 118

వ. అట్లు గావున రణంబునకిప్పుడు శత్రులమోహరించుట కా
ర్యంబు గాదు మనకుం దగుకాలంబున జయింతము నలంగక
తొలంగుండనినఁ దలంగి భాగవతభటభీతులై చిక్కురక్కసు
లు రసాతలంబునకుం జని నెప్పుడు హరిధ్యానయుం బెఱింగితా

ద్వ్యనందనుండు యాగసుత్యాహంబున వారుణపాశంబుల
నసురవల్లభుని బంధించె నంత. 119

క. బాహులుఁ బదములుఁ దట్టిన
శ్రీహరికృపగాక యేమిసేయుదు నని సం
దేహింపక బలి నిలిచెను
హాహారవ మెసఁగె దశదిగంతములందున్. 120

క. సంపద సెడియును దైన్యముఁ
గంపంబును లేక తొంటికంటెను బెంపుం
బెంపును నెఱుకయు ధైర్యము
వంపని సురవైరిఁ జూచి వటుఁ డిట్లనియెన్. 121

సీ. దానవ త్రిపదభూతల మిత్తునంటివి
ధరణిఁ జలంధార్యుఁ డెందాఁక నుండు
రంతభూమియు నొక్క యడుగయ్యె నాకను
స్వర్లోకమును నొక్క చరణమయ్యె
నీసొమ్ము సకలంబు నేఁడు రెండడుగులు
గడమపాదమునకుఁ గలదె భూమి
యిచ్చెద నన్నర్థి మీనిదురాత్ముండు
నిరయంబుఁ బొందుట నిజముగాదె

తే. కాన దుర్గతికిని గొంతకాల మరుగ
కాక యిచ్చెదవేని వేగంబ నాకు
నిపుడు మూఁడవపదమున కిమ్ముఁ జూపు

బ్రాహ్మణాధీనములు ద్రోవ బ్రహ్మవశము. 112

వ. అని యిట్లు వామనుండు వలుక సత్యభంగసందేహావిషదిగ్ధ శల్యనికృత్త హృదయుండయ్యును భీతుండుగాక వైరోచని ప్రసన్నవదనంబుతోడఁ జిన్నిప్రోడవడుగున కిట్లనియె. 123

ఆ. సూనృతంబుగాని నుడియదు నాజిహ్వ
బొంకఁజాల నాకు బొంకులేదు
నీతృతీయపదము నిజము నాశిరమున
నెలవుసేసి పెట్టు నిర్మలాత్మ. 124

ఆ. నిరయమునకుఁ బ్రాప్తనిగ్రహంబునకును
బదవిహీనతకును బంధనమున
కర్థభంగమునకు నఖిలదుఃఖమునకు
వెఱవ దేవ బొంక వెఱచినట్లు. 125

వ. అదియునుంగాక. 126

సీ. తల్లిదండ్రులు నన్నదమ్ములుఁ జెలికాండ్రు
గురువులు శిక్షింపఁ గొఱఁతవడునె
పిదప మేలగుఁగాక పృథుమదాంధులకును
దానవులకు మాకుఁ దఱి యెఱింగి
విభ్రంశచక్షువు వెలయనిచ్చుటఁ జేసి
గురువులలో నాది గురువవీవ
నీవు బంధించిన నిగ్రహమో లజ్జ
యో నష్టియో బాధయో తలంప

తే. నిన్ను నెదిరించి పోరాడి నిర్జరారు
లాదియోగీంద్రు లందెను సద్గతింకి
నందరే తొల్లి పెక్కండ్రు హర్షమూర్తి
యీశ నీమెడ దుర్లభ మేమిగలదు. 127

మ. చెలియే మృత్యువుచుట్టమేయముఁడుసంసేవార్థులేకింకరుల్
శిలలంజేసెనె బ్రహ్మ దన్ను వృథమే జీవంబు నోచెల్లరే
చలితంబౌట రొయ్యుంగ కీకపటసంసారంబు నిక్కంబుగాఁ
దలఁచూ మూఢుఁడు సత్యదానకరుణాధర్మాదినిర్ముక్తుఁడై.

సీ. చుట్టాలు దొంగలు సుతులు బుణార్థులు
కాంతలు సంసారకారణములు
ధనము లస్థిరములు దను వతిచలనంబు
గార్హ్యార్థ లన్యాలు గడచుఁ గాల
మాయుష్యమైశ్వర్య మతిశీఘ్రమనికాదె
యనఘుండు తమతండ్రి నతకరించి
మాతాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుండు
నీపాదకమలంబు నియతిఁజేరె

తే. భ్రమఁ దతనికి మృతిలేని బ్రతుకు గలిగె
నైరుత్రై కాని తొల్లి మావారు గాన
రక్షివై వచ్చి నీవు నన్నడుగుచెల్లఁ
బద్మలోచన నాపుణ్య ఫలముగాదె. 129

వ. అని యిట్లు పలుకుచున్న యానపరాబుఁ. 130

శా. ఆదైత్యేంద్రుఁడు పేదవడ్డు నవపద్మాక్షుం బిశంగాంబరా
చ్ఛాదున్ నిర్మలసాధువాదు ఘనసంసారాదివిచ్ఛేదు సం
శ్రీదున్ భక్తిలతాతిరోహితహరిశ్రీపాదు నిఃఖేదుఁ బ్ర
హ్లాదున్ బోధకళావినోదుఁ గనియెన్ హర్షంబుతో ముందటన్.

వ. ఇట్లు సమాగతుండై నతమతాతతం గనుంగొని విరోచననందనుండు వారుణపాశబద్ధుండు గావునఁ దనకుం దగిననమస్కారంబు సేయరామిం జేసి సంకులాశ్రువిలోలలోచనుండై సిగ్గుపడి నతశిరస్కుండై నమ్రభావంబున మ్రొక్కు సెల్లించె నంతఁ బ్రహ్లాదుండు మఖమండపంబున సునందాదిపరికరసమేతుండై కూర్చున్న వామనదేవునిం గని యానందబాష్పజలంబులుం బులకాంకురంబులున్ నెఱయ దండప్రణామం బాచరించి యిట్లని విన్నవించె. 132

సీ. ఇతనికి మున్ను నీ వింద్రపదం బిచ్చి
నేఁడు త్రిప్పుటయును నెఱయ మేలు
మోహనాహంకృతి మూలంబు గర్వాంధ
తమసవికారంబు దాని మాన్పి
కరుణ రక్షించుట గాక బంధించుటే
తత్త్వజ్ఞునకు మహేంద్రత్వ మేల
నీపాదకమలంబు నియతిఁ గొల్చినవానిఁ
బోలునే సురరాజ్య భోగపరత
తే. గర్వమే పారఁ గన్నులు గానరావు

చెవులు వినరావు చిత్తంబు సిక్కువడును
మఱచు నీసేవలన్నియు మహిమ మాన్పి
మేలు సేసితి నీమేటి మేరసూపి. 133

వ. అని పలికి జగదీశ్వరుండును నిఖిలలోకసాక్షియు నగునారా
యణదేవునకు నమస్కరించి ప్రహ్లాదుండు పలుకుచున్నసమ
యంబున. 134

మ. తతమత్తద్విపయానలై తతనిరుంధచ్చోళసంవ్యానలై
ధృతబాష్పాంబువితానలై కరయుగాధీనాలికస్థానలై
పతిభిక్షాం మమ దేహి కోమలమతే పద్మాపతే యంచుఁద
త్సతి వింధ్యావళి సేరవచ్చెఁద్రిజగద్రక్షామనున్ వామనున్.

వ. వచ్చి యచ్చేడియ తచ్చరణసమీపంబునఁ బ్రణతయై నిలు
వంబడి యిట్లనియె. 136

క. నీకుం గీర్తిడార్థముల కు
లోకంబులఁ జూచి పసులు లోకులు కుమతుల్
లోకాధీశుల మందురు
లోకములకు రాజవీవ లోకస్తుత్యా. 137

క. కాదనఁడు పొమ్ము లే దీ
రాదనఁడు జగత్త్రయైకరాజ్యము నిచ్చెన్
నాదయితుఁ గట్టనేటికి
శ్రీదయితాచిత్తచోర శ్రితమందారా. 138

వ. అని యిట్లు వింధ్యావళియుం బ్రహ్లాదుండును విన్నవించునవ

సరంబున హిరణగర్భుండు సనుమెంచి యిట్లనియె. 139

సీ. భూతలోకేశ్వర భూతభావన దేవ
దేవ జగన్నాథ దేవవంద్య
తనసొమ్ము సకలంబుఁ దప్పక నీకిచ్చె
దండయోగ్యుఁడు గాఁడు దానవుండు
గరుణింప నర్హుండు గమలలోచన నీకు
విడిపింపు మీతని వెఱపుదీర్చి
తోయపూరము సల్లిదుర్వాంకురంబులఁ
జేరి నీపదము లర్చించునట్టి

తే. భక్తియుక్తుఁడూ నాకేశపదము నంది
నీవు ప్రత్యక్షముగ వచ్చి నేఁడు వేఁడ
నెఱేఁగి తనరాజ్యమంతయు నిచ్చినట్టి
బలికిఁ దగునయ్య దృఢపాశ బంధనంబు. 140

వ. అని పలికిన బ్రహ్మవచనంబులు విని భగవంతుండిట్లనియె.

సీ. ఎవ్వనిఁ గరుణింప నిచ్ఛించితిని వాని
యఖిలవిత్తంబు నే నపహరింతు
సంసారగురుమద స్తబ్ధుఁడై యెవ్వఁడు
దెగడి లోకము నన్ను ధిక్కరించు
నతఁ డెల్లకాలంబు నఖిలయోనులయందుఁ
బుట్టుచు దుర్గతిఁ బొందుఁబిదప
విత్తవయోరూప విద్యాబలైశ్వర్య

కర్మజన్మంబుల గర్వముడిగి
తే. యేకవిధమున విమలుఁడై యెవ్వఁడుండు
వాఁడు నాకూర్చిరక్షింపవలయువాఁడు
స్తంభలోభాభిమానసంసారవిభవ
మత్తుఁడై చెడ నొల్లఁడు మత్పరుండు. 142
శా. బద్ధుండై గురుశాపతప్తుఁడయి తా బంధువ్రజత్యక్తుఁడై
సిద్ధైశ్వర్యముఁ గోలుపోయి విభవక్షీణుండు నై పేదయై
శుద్ధత్వంబునుసత్యముంగరుణయున్ సొంపేమియుందప్పఁడు
దృఢుండై యజయాఖ్యమాయగెలిచెంబుణ్యుండితండల్పుఁడే.
ఆ. అసురనాథుఁడనుచు ననఘునిమర్యాద
ద్రోఁను జూతమనుచు నింతవలుక
నిజమువలికె నితఁడు నిర్మలాచారుండు
మేలు మేలు నాకు మెచ్చువచ్చు. 144
క. సావర్ణిమనువువేళను
దేవేంద్రుండగు నితండు దేవతలకు సం
భావిత మగునాచోటికి
రావించెద నంతదాఁక రక్షింతు దయన్. 144
క. వ్యాధులుఁ దప్పులు నొప్పులు
బాధలుఁ జెడి విశ్వకర్మభావితవసుజా
రాజితసుతలాలయమున
నానావిభవమున నుండు నితఁ డిందాఁకన్. 146

వ. అని పలికి బలిం జూచి భగవంతుం డిట్లనియె. 147

సీ. సేమంబు నీ కింద్రసేనమహారాజ
వెఱవకు మేలు నీవితరణంబు
వేలుపు లందుండ వేఁడుకపడుదురు
దుఃఖంబు లిడుములు దుర్మరణము
లాతురతలు నొప్పు లంటుండువారికి
నొందవు సుతలమందుండు నీవు
నీపంపు సేయని నిర్జరారాతుల
నాచక్ర మేతెంచి నఱకుచుండు

ఆ. లోకపాలకులకు లోనుగా నక్కడ
నన్యు లెంతవార లచట నిన్ను
నెల్లప్రొద్దు వచ్చి యేను రక్షించెదఁ
గరుణతోడ నీకుఁ గానవత్తు. 148

క. దానవదైత్యులసంగతిఁ
బూనిన నీయసురభావమును దోఁత్తో మ
ద్ధ్యానమునఁ దలఁగిపోవును
మానుగ సుతలమున నుండుమా మాయాజ్ఞన్. 149

వ. అని యిట్లు పలుకుచున్న ముమ్మూర్తులముదుకవేల్పు తి
య్యని నెయ్యంపుఁబలుకుఁ జెఱకురసంపు సోనలు వీనుల
తెరువులంజొచ్చి లోను బయలు నింపి తెప్పలకప్పుదప్పం
దోఁచికొని కనుఁగవకొలంకుల నలుఁగులు వెడలింపం దం

బున సంతసంబునం గన్నీరు మున్నీరై పఱవ నురగశఫలకం
బునం బులకంబులు కులకంబులయి తిలకంబులొత్తఁ గేలు
మొగిడ్చి నెక్కొన్న వేడుకం ద్రొక్కుడువడుచుఁ జిక్కని చి
త్తంబునఁ జక్కనిమాటల రక్కసులఱేఁ డిట్లనియె. 150

ఉ. ఎన్నఁడు లోకపాలకుల నీకృపఁ జూడనినీవు నేఁడు న
న్నున్నతుఁ జేసి నాఁబ్రదుకు నోజయు నానతియిచ్చి కాచితీ
మన్నన లీదయారసము మాటలపెద్దఱికంబుఁ జాలవే
పన్నగతల్ప నిన్నెఱిఁగి పట్టిన నాపదగల్గనేర్చునే. 151

వ. అని పలికి బంధవిముక్తుండై హరికి నమస్కరించి బ్రహ్మ
కుం బ్రణామంబు నేసి యిందుధరునకు వందనం బాచరించి
తనవారలతోఁ జేరికొని బలి సుతలంబునకుం జనియె. 152

ఆ. బ్రదుకవచ్చుఁగాక బహుబంధనములైన
వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక
మాటఁ దిరుగలేరు మానధనులు.



# పరమహిమ



## ధర్మపీకండు.

( చిఱుతొండనంబి. )

క. శ్రీరాజరాజకీలిత
భారతరామాయణాదిభవ్యపురాణా
యారాధితపరమేశ్వర
ధీరగుణాభరణ యవచిదేవయతిప్పా. 1

వ. అవధరింపుము పార్వతితోఁ బరమేశ్వరుం డిట్లు చెప్పందొ
డంగె. 2

గీ. దీవులం దెల్ల నేరెటిదీవి లెస్స
భరతఖండంబు మేల్తదంతరమునందు
ద్రివిడదేశంబు కడు నొప్పు దానియందుఁ
గాంచికామండలం బందుఁ గాంచిపురము. 3

శా. ఆకాంచీనగరంబునందు శివభక్త్యాచార సామ్రాజ్యల
క్ష్మీకంఠాభరణంబు నిర్మలవణిక్శ్రేష్ఠాన్వయాంభోధికి
న్రాకాపూర్ణనిశాకరుండు చిఱుతొండశ్రేష్ఠుఁ డయ్యుత్తముం
డేకాలంబును బాయకుండు గిరిపుత్రీశానపూజావిధుల్. 4

ఉ. ఎందఱు జంగమప్రముఖు లెత్తఱి నేమిపదార్థ మెంత యే
కందువ వేఁడినం దిరముగా నతఁ డందఱ కాపదార్థ మా
కందువ యేపు ప్రేమమెసఁగా నిడిసైన ఘటించిపెట్టు పూ
ర్ణేందునిభాస్య! వానిసరి యెవ్వఁడు లేఁడు వసుంధరాస్థలిన్.

గీ. కలియుగంబునఁ గల్యాణకటకనగరి
నాకు భక్తుండు బసవరనాథుఁ డొకఁడు
కాంచినగరంబులో వణిగ్వంశవరుఁడు
నాదుభక్తుండు చిఱుతొండనంబి యొకఁడు. 6

శా. అయ్యార్యాఢ్యవవంశసంభవుని నేకామ్రాధినాథాంబికా
శయ్యామందిరనిర్మలాత్మకుని భిక్షావృత్తి జంగం బొకం
డొయ్యం జేరఁగవచ్చి మాశివుని నేఁ డోలార్చనంగానఁ దే
వయ్యా యిక్షురసంబు తూమెఁడనుచుం బ్రార్థించి నేమించినన్

శా. అష్టేకాకని భూతియందుకొని శైవాచారసంపన్నుఁ డా
సెట్టిశ్రేష్ఠుఁడు తోఁటకుంజని రసశ్రీమాధురీలక్ష్మికి
న్నెష్టౌ నిమ్ముల మంచి నల్లచెఱకు ల్బాఠంబుగా విర్చి వే
కష్టైన్మోపు వనీకతోరలతికాకాండప్రకాండంబులన్. 8

క. తూమెఁడురసమునకుం దగ
వామెఁడు పుండ్రేక్షులతలు వ్రక్కువగ లతా
దామములఁ గట్టి నెట్టిన
యామోపుఁ గదల్పలేక యవశుం డయ్యెన్. 9

క. వశఁ బెఁడురసంబు గలుగం

గరయంత్రం బాడ నెన్నిగడలు వలయు న
న్నిరసాలకాండకంబు
*సిరియాలునితండ్రి యెత్తు లేకున్నయెడన్. 20

గీ. ఏనొకఁడఁ బోయి యొకవంక నెత్తికొంటి
నాతఁ డొకవంక నెత్తె మో పవిత్రతనయ !
భారమున డస్సి యవ్వణిక్పతి నెమర్చె
నేను నపుడు నెమర్చితి నేమిచెప్ప. 11

గీ. వలతు నే భక్తకోటికి వారిజాక్షి
లలన యాభక్తకోటియు వలచు నాకు
“ భక్తవతి లింగపతి ” యనుపాత్రమాట
నేఁడుగాఁ గల్గనే యలినీలవేణి! 12

వ. అనినం బార్వతి యాశ్చర్యంబంది యాసర్వజ్ఞుతోడ దేవా యవ్వీరమాహేశ్వరు నాకుం జూడవలయుఁ గంచికిం దోడ్కొనిపోవే యని ప్రార్థించిన నప్పంచవదనుండు సమీపంబునం గాచియున్న పాకశాసనుం గాంచి యిట్లనియానతిచ్చె.

సీ. పాకశాసన కంచిపట్టణంబునయందు
నాల్గుదిక్కులయోజనములు మూఁడు
ముయ్యేడు వాసరంబు లకాలవర్షంబు
గురియింపఁ బంపు మొగుళ్లగములఁ
బగళులు రేలు కుంభద్రోణములుగాఁగఁ ;

---

*సిరియాలునితండ్రి = చిఱుతొండనంబి; ఈవిషయము ముందు తెలియనగును.

గలదు మాకు రహస్యకార్య మొకటి
యనిన తత్క్షణమాత్రిఁ నై రావణము నెక్కి
యమరావతికి నేఁగి యమరవిభుఁడు
పుష్కలావర్తకాదికాంభోధరముల
సంకిలియ లూడ్చి తెప్పించి సత్వరముగఁ
బంచెఁ గాంచీపురంబునఁ బడియుఁబడునొ
కొండుదినములు వర్షించుచుండుఁ డనుచు. 14

వ. అంత విగళితశృంఖలాబంధంబులై పుంఖానుపుంఖంబులం బుష్కలావర్తకాదికంధరంబులు విజృంభించి కుంభద్రోణంబులుగ విశ్వంభరామండలం బేకార్ణవంబుగా ధారాపాతంబు గురియందొడంగె నప్పుడు. 15

గీ. ఊలవడిచొచ్చి కామాక్షి నుత్తరించె
నగరితోఁగూడ నేకామ్రనాథు ముంచె
హస్తిగిరినాథుశ్రీపాద మప్పళించెఁ
గంచిఁ దెప్పలఁదేల్చె నకాలవృష్టి. 16

వ. ఇవ్విధంబున నిరువదియొక్కవాసరంబులు వెలుపులేక పాముఁవేలంగట్టినభంగి నింగియవిసి కాఱినచందంబున సముద్రంబు వెల్లివిరిసినలీలం జలంబు తెఱచినవడువున మిన్నుపల్లంబులు సరిగా నంపఁజాలంబుపగిదిఁ గురిసి యిరువదిరెండవదివసంబునందు. 17

ఉ. ఒయ్యన వెల్లుసూపి జడి నుబ్బరవోయెడు పాణికోటికిన్

దయ్యేము నెత్తికోలు తుదిదాకఁగఁ దూరుపుదెల్లవాఱి తె
ల్పయ్యెను నీరు వీథిబడి యంబుధి కేఁగె నదీముఖంబునం
బయ్యరవట్టె మేఘములు పర్వులువాఱె నుదజ్ముఖంబులై

మ. ఎడవెల్లైనను లేక పెక్కుదినముల్ హేరాలమైవర్షముల్
జడిగాఁబట్టి తటాలనంగ వెలిచెన్ ఝంఝూనమీరంబుతో
నుడుమార్గం బఖిలంబు నున్ననయి శాణోత్తేజనంబొందిప్ర
ల్కడుగంబడ్డ నిశాతఖడ్గముక్రియం గన్పట్టె నప్పట్టునన్. 19

గీ. కడుమహోత్పాతమగుచు నకాలవృష్టి
కంచి ముయ్యేడునాళ్లు వర్షించినపుడు
వెలిచినప్పుడ యీపీడు విడుచువార
మనుచుఁ బట్టిరిపత్తిన బౌద్ధాదిజనులు. 20

వ. బౌద్ధ, జైన, పాషండ, లోకాయతిక, చార్వాక, కాపాలి
కాహితుండిక, వానప్రస్థ, పాశుపత, జంగమ, యోగిప్రము
ఖులగువై దేశికులలోఁ బట్టణంబునం గాఁపురంబున్నవారం
దఱుందక్కఁ దక్కినవా రందఱు గుంపులుగట్టి కోలంగొట్టిన
తెఱంగున జలోపద్రవంబుం దిట్టువారై మూఁడామడమేర
యంతయుం బుక్కిటిబంటియైనఁ దత్పరిదేశంబు వెడలి గం
డంబులం గడచితిమని గుండియలు సిగిడికొనుచుం జనిరి.

శా. ఆముయ్యేడుదినంబులందు శివభక్త్యాచారసంపత్తికిన్
సీమాభూమి యనం బ్రసిద్ధుఁ డగునాచిర్తొండనంబీశ్వరుం
డేమీ కొంకకపెట్టు జంగములకున్ హేరాలమిష్టాన్నముల్

సేమంబొప్పఁగ రేలునుంబగలునుస్వశ్వాసపూర్వంబుగన్.

చ. అనిశమునుం గుమార సిరియాళుఁడు నాతనిదాది యైనచం
దనికయు ధన్యు లప్పరమదంపతులున్ శివభక్తకోటికై
యనుపమవృష్టి వేగఁగొనియాడుదు రెన్నియునుం దెఱంగులన్
దినములు రేపవల్ మధుదనైపరిచు రాన్నసమర్పణంబునన్.

గీ. వంటచెఱకులు లేకున్న వాముతైన
వస్త్రములు తైలమున ముంచి వహ్నిఁగూర్చి
వంటకంబులు వండి యవ్వారిగాఁగఁ
బెట్టు శివభక్తతతికి నంబిప్రభుండు. 24

క. కఱకంఠునిభక్తులకుం
జెఱుతొండఁడు మిగుల భక్తి సేయుచునుండున్
దఱచగు పెనువానలలో
నూఱవగుకూటముల మసఁగు లోకెముల్ఱుచున్. 25

వ. శతైకవృద్ధిలబ్ధంబు లైనధనంబులఁ గోటికిం బడగయెత్తిన
యక్కిరాటవంశకిరీటాలంకారంబు వీరశైవాచారంబాధా
రంబుగా శరీరార్థప్రాణవంచనంబు సేయక జంగమప్రమథు
ల నారాధించుచుఁ గల్పాంతకాలకల్పంబు లైనయాదుర్ది
నంబుల నియమం బుపద్రవంబు నొందకుండం గాపాడుకొ
నుచునుండెనిట్లుండ నవ్వానవెలియుదినంబు సంప్రాప్తించె.

గీ. ప్రతిదినంబును జంగమప్రమథముఖ్యుఁ
డొకఁడు మొదలుగ మఱి యెంద ఱొదవకున్న

నారగింపని బొసవాఁ డగుటఁ జేసి
నాఁడు పుణ్యుండు చిఱుతొండనంబివిభుఁడు. 27

వ. మధ్యాహ్నకాలంబున వీరమాహేశ్వరసమయసిద్ధాంతమా
ర్గానుసారంబున. 28

ఉ. ధీనిధి సెట్టి నంబి తనదేహమునిండ విభూతిమంగళ
స్నానముఁ జేసి ధౌతపరిధానముఁగట్టి త్రిపుండ్రధారియై
చేనమృతాంశుమౌళిని వశీకృతభక్తు ధరించి సంతత
ధ్యానముఁ జేసి యెంతయునుదత్పరభావముప్రస్ఫుటంబుగన్.

సీ. జలకమార్చె నవీనచంద్రార్ధమౌళికిఁ
దడియొత్తె భక్తమందారమునకుఁ
జందనంబర్పించె జగదేకభర్తకుఁ
బుష్పమాలికలిచ్చె భూతపతికి
ధూపంబుసంధించె దురితసంహారునకు
దీపమిచ్చెను మహాదేవునకును
దారంబూలమొనరించె నంబికాధవునకుఁ
బ్రణమిల్లె గజదైత్యభంజనునకు

గీ. జంగమారాధన క్రియానమయమునను
గాని యుపహార మీరాని కారణమున
దేవదేవుని విరిసెజ్జఁ దిరముసేసి
వాకిటికివచ్చె శివయోగివరుల నరయ. 30

క. ఏవేళజూచినం దన

శ్రీవాకిటఁ బగటివేళ శివయోగివరుల్
వేవేలసంఖ్య లుండెడ
రావేళ నొకళ్లులేమి యద్భుతమయ్యెన్. 31

గీ. అప్పు డాశ్చర్యమంది వైశ్యప్రభుండు
మగుడి లోనికిఁ జనుదెంచి మంద్రఫణితి
నోలతాతన్వి శివయోగి యొకఁడు లేఁడు
నేఁడు మొగసాల నిది యేమి మూఁడెనొక్కొ. 32

చ. ముసురుదినంబులందుమనమోసలఁబంచయరుంగువీఁదటన్
భసితవిభూషణుల్ పరమపావనమూర్తులు శైవసంహితా
భ్యసనపరాయణు ల్గిరిశభక్తు లనేకులు నిండియుందు రే నేఁ
డసితసరోరుహాక్షి యొకఁడైనను లేఁడిది యేమిచోద్యమో.

గీ. వీథికై యోగివత్తునా వేగవేగ
నేఁడుమాత్రము కొందఱు నియమపరులు
పాదసరసీజయుగళ ప్రసాదమాత్రి
మబ్బెదరుగాక మనభాగ్య మల్పమగునె. 34

వ. అని పల్కి తిరువెంగనాంచితో నేను జంగమప్రముఖులం
బురంబువీథుల వెదకి తేరంబోవుదుఁగాన లింగార్చనముల
కుం గగినపదార్థంబు లొడంగూర్చుకొనియుండుమా యని
చందనంబును భూతియు జెందిరయుఁ బుచ్చుకొని దుప్ప
టంబు ధరియించి చిఱుతొండనంబి నిజగృహంబు వెలువడి
యక్కాంచినగరమ్మునందు. 35

ఉ. అంగడి వేల్పుటిండ్ల సురావసథంబుల రచ్చపట్టులన్
జంగిలిసాలలం గణకశాలల వేశ్యలవాసవాటికా
ప్రాంగణభూములందు శివభక్తిపరాయణుఁ డర్థితోడుతన్
జంగమముఖ్యులన్ వెదకె సంభ్రమమున్ భయమున్ దలిర్పఁగన్.

గీ. బ్రిమసి తప్పినపసరంబు నెమకినట్లు
బెరసి చేఁదప్పిపడ్డ సొమ్మరసినట్లు
పురములో వాడవాడలఁ దిరుగఁజొచ్చె
జంగమాన్వేషణార్థియై శైవవరుఁడు. 37

క. వచ్చినవాడకు వచ్చుం
జొచ్చినవాసంబుఁ జొచ్చుఁ జొచ్చినచోటే
యచ్చుగఁ గ్రమ్మఱఁజొచ్చుం
బచ్చు శివార్చనకు శంభుభక్తుల వెదకన్. 38

వ. ఇవ్విధంబునఁ గంచియెల్లనుం బరికించి యెందుఁ గానక కోటవదలి యక్కఱాటకులశ్రేష్ఠుండు తప్పగానరిగి బాహ్యాళిప్రదేశంబునఁ బువ్వుందోఁటచేరువ నొక్కపాడుపడిగబ్బ మంటపంబున శతవర్షదేశీయుండును జరాజర్జరితదేహుండును బలితపాండుజటామండలుండును రుద్రాక్షమాలికాభసితత్రిపుండ్రాలంకృతుండునై నిజవయోనురూపయగు గుబ్బిడ్డి యవ్వ పాదంబులొత్తుచుండం బులికలాసంబుమీఁదం బవళించియున్న యయ్యవారికి శరణార్థి యగుచు మ్రొక్కె.

ఉ. మ్రొక్కి కరాంబుజద్వయము మోడ్చి లలాటమునన్ ఘటించి చిమా

యక్కడ మీరు నీముసలియవ్వయు నేఁడు శివార్చనంబుస
మ్యక్కృతిఁ జేసి నన్నుఁ జరితార్థునిఁ జేయుటయుక్తమంచునా
టక్కరిమాయజోగికిఁ దటాలుమనం బ్రణమిల్లినంతటన్.

గీ. నరసి వ్రాలిన బొమలెత్తి పరమవృద్ధ
తలవడంకఁగ నొయ్య నీరెలుఁగుపడుచు
నంబిరెమ్మోము తేరకొసంగఁ జూచి
శివుని కారుణ్యమనుచు నాశీర్వదించె. 41

క. దీవించి యతనివదనముఁ
జేవెలుఁగిడి చూచి యేమిచెప్పెదు చెపుమా
యే వీనులలవిఁ గావున
నీవొత్తుచుఁ జెప్పు చెప్పెదేని మహాత్మా. 42

వ. అనినం జెఱుకొండండు కృతాంజలియై యుచ్చైస్స్వరంబున దేవా మాయింటికి శివార్చనంబుసేయ దేవియు నీవును విజయముచేసి మమ్ముం గృతార్థులఁ జేయ విభూతి యందు మనుటయు. 43

సీ. నీవంశ మెయ్యది నీనామ మెఱిఁగింపు
శివభక్తిసమయదీక్షితుఁడవా దె
పెండ్లాము నీకుఁ జెప్పినయట్లు సేయునే
కులము సంతానంబు గలిగియున్నె
కూడు నీరలకింటఁ గొదలేకయుండునే
యడిగినయర్థ మీ ననువుపడునె

మెదిరి వా ఖండించు టివిదెప్పరముసుమ్ము
జలగజంపులు జోగిజంగకులము
గీ. లడిగితిమిగాని యెవ్వండ వైననేమి
యొక్కభిక్షుకుఁగా. నిన్ను నోరయనేల
శైవవీరవ్రతాచార సాహసుండు
తనయుఁ డొక్కఁడు గల్గ నాపనికిఁజాలు. 44
వ. ఈవృథాలాపంబులఁ బనియేమినామనోరథంబువినుము. 45
సీ. ఏఁడుగాలంబయ్యె నేను నిరాహార
ఘోరవ్రతంబుఁ గైకొన్నవాఁడ
హరునినుద్దేశించి యమ్మహావ్రతమున
కుద్యాపనంబు పశూపహార
మయ్యాగపశువు నన్యంబేదియునుగాదు
నరుఁడు కావలయు నన్నరుఁడు బ్రాహ్మ
ణక్షత్రివైశ్యసంతతులలో నొక్కఁడౌ
వాఁడును గడుఁ బిన్నవయసువాఁడు
గీ. రోగశంకావిహీనుండు రూపసియును
వానితల్లియుఁ దండ్రియు వడుగుసేసి
పాకమొనరించి వడ్డింప భవున కొసఁగి
కుడుతు నాపక్ష్కిసీవు నీకొడుకుఁ గుడువ. 46
వ. అనినం జిఱుతొండనంబి మహాప్రసాదంబ యేను వైశ్యకుల
సంభవుండ తిరుకచ్చినంబి సంబంధబాంధవుండనా పేరుచిఱు

తొండనంబియుండు౯ శివభక్తులకుం బాదచర్యచేయుచుండు.

గీ. భక్తుఁ డేవ్రతంబుపట్టె నావ్రతము పా
రంబుఁబొందఁ జేయు వ్రతమునాది
యీవ్రతంబు నాకు నెప్పుడొడంగూడ
దప్పుడు తిరుబాస యనఘచరిత. 48

వ. నీయానతిచ్చినప్రకారంబున నయ్యుపహారంబు సేయించెద
విభూతియందుకొనుము మాయింటికి విచ్చేయు మభ్యంగన
స్నానం బవధరించిన యంతలోన వంటకంబు లాయితంబు
లగునని ప్రార్థించిన. 49

శా. మోమడ్డంబుఁగదల్చి మోరకుఁడునుంబోలెన్నివారాధకుం
డా మానాధికుతోడ నిట్లనియె నయ్యా వృద్ధ నేనీవచః
ప్రామాణ్యంబులు విశ్వసింప నతిదూరం బౌనతీవచ్చెనీ
రామారత్నము కాదుకూడ దనినన్ రాఁజాలనీచోటికిన్.50

చ. ఉదరమునన్ భరించి ప్రసవోద్భవవేదనఁబొంది పిమ్మటన్
ముదిముదినైన పీతఁబడి మూత్రమునంబడి లజ్జవందుగా
నదవదనైన తల్లికిఁ బ్రియంబొ సుతుండు వృథాభిమానదు
ర్మదుఁడగుతండ్రికింబ్రియుఁడొమానసవీథిఁదలంచిచూడుమా.

వ. ఇంతకుఁ గృతం బింతలేసి వీరమాహేశ్వర ఘోరవ్రతంబులు
నీవు చేసినయవి లేవు పుత్రస్నేహంబు సామాన్యంబుకాదు
నీవును నీభార్యయును విచారించుకొనునది యిక్కార్యంబు
మీకిద్దఱకును సమ్మతంబగునేని. 52

గీ. అందునదిభూతిఁ దొలుత నీయనుఁగుభార్య
యందుకొనువాఁడ వీవు ననంతరమున
నాలుమగఁడును నొకకుత్తుకైనఁగాక
యిట్టిధర్మంబు మిన్నక యేలకలుగు. 53

వ. మీరిద్దఱు సమ్మతించిరయేనియు హంతవ్యు డగునక్కుమా
రుం డిక్కార్యంబునకు నెవ్విధంబున నొడంబడువాఁడు. 54

గీ. నీకుఁ జంపంగవచ్చుఁబో నియమనిష్ఠఁ
దల్లి కోర్వంగవచ్చుఁబో ధైర్యగరిమ
మాకు భుజియింపవచ్చుఁబో మనసుతీవుటఁ
జిఱుతవానికిఁ జావు దుస్తరముగాని. 55

ఉ. పాడయినట్టి చిత్త మొకపాటున నిల్పఁగ మాటిమాటి క
ట్టాడుచు నుండుఁగాన తనయాత్మయునుం దనకిట్టి దానసం
గూడునొ కూడదో యెదిరికోర్కి యెఱుంగుటయెట్టుకుట్టియా
చూడఁగ దోసకాయలె విశుద్ధయశోధన యన్యచిత్తముల్.

క. శివభక్తుఁడ యిదికొని య
య్యువిదకును విభూతి యీప్రయోజనమునకై
యవుఁగాక లెంకికేఁగుమ
నవలంబియె కంచి నీకు నడుగామడయే. 57

వ. అనినం జిఱుతొండండు నిజాంతర్గతంబునం దనభార్యకుంగల
శివభక్తివిశ్వాసంబులును జంగమారాధననియమనిష్ఠయుఁ
దనమానతి దాఁటమియునుం గుమారసిరియాళుండు నట్టి

వాఁడగుటయు నెఱింగియు నాశివయోగితో నవ్వఁగాదని యుత్తరప్రత్యుత్తరంబులకు నెట్టుకొనంజాలక ఛందోనువర్తనంబ మహాప్రసాదంబని యతండిచ్చు విభూతియందు కొని నిజమందిరమునకు వచ్చినంత. 58

గీ. ఇంటిలోనుండి వెలుపలి కేఁగుదెంచి
యుంగనారత్న మగుతిరువెంగనాంచి
భర్తముఖరాగ మీక్షించి ప్రమదమొందెఁ
గాలమున నెందు శివయోగి గలిగెననుచు. 59

వ. చిఱుతొండనంబియు నాబింబాధరకు శివయోగిసంభ్రమించుటయుఁ దద్వ్రతచర్యాప్రకారంబునునాదిమధ్యావసానంబుఁ దెలియంజెప్పుటయు నయ్యింతి యింతయు మిసిమింతురాలుగాక మునిమునినవ్వు నవ్వి మనశరీరార్థప్రాణంబులకుం గర్తలు శివయోగీశ్వరులేకాక మఱియెవ్వరు వారిసొమ్ములువారికే సమర్పించు టదియును నొకదొడ్డపనియే యెటువిశేషించి

చ. వలచినయేని నబ్బునవవంద్యునకు న్శివయోగినేతకున్
బాలకయిగారవంబయినపుత్త్రికుఁడొక్కఁడయేలమాంసమున్
వలముగ మీరు నేను నగువారమకామె విభూతిఁదెండిఁకం
బలుకులు వేయునేటికలభక్తునినేమము పారమొందుతన్.

వ. అనిసఁ దదర్థంబు నిశ్చయించి చందనికకు నవ్వృత్తాంతంబంతయు నెఱింగించి ముప్పురు నేకోద్యోగంబున శివయోగికిం బరిచర్య సేయువారై రి. చిఱుతొండఁడును శివయో

గిం దోడ్తేరంజనిమె నంతకుఁ బూర్వంబువందు. 62

చ. కపటపుమాయజోగి యగుఖండశశాంకధరుండు వృద్ధవే
షపుఁదనరూపు వీడి వెలిచక్కనయుండఁగ నొండురూపుతో
నపగతదోషుఁ డైనసిరియాళకుమారకుఁ డొజ్జయింటిలో
లిపిపఠియింపఁగా మదిఁ జలింపఁగఁ జేయుకుతూహలంబునన్.

వ. వచ్చి చూచినంత. 64

ఉ. హస్తగృహీతపుస్తకమునందు లిఖించినయట్టి నీలకం
ఠస్తవము న్పఠించుచు ఘనంబుగ ధీగుణవైభవోన్నతుల్
విస్తరిలంగ బాలకులు వేవురిలో సిరియాళుఁడుండె న
భ్యస్తలిపి ప్రపంచుఁడు గ్రహంబులలో నుడురాజుకై వడిన్.

గీ. ఆజటాధారి చేరంగ నరుగుదెంచి
తనకు సాష్టాంగమెరఁగి తాత్పర్య మెసఁగఁ
గేలుఁదమ్ములు మొగిచియించి కెలననున్న
చిన్నిముద్దుల సిరియాళసెట్టి కనియె. [యే

శా. అన్నా యీచిఱుతొండనంబియనుపాపాత్ముండు మీతండ్రి
యన్నిర్భాగ్యుఁడు జోగికొక్కరునికిన్ హాలామవోన్మాదికిన్
నిన్నుం జంపి మహేశహారముగ వండింపంగనున్నాఁడు సం
పన్నస్నేహముతోడ నీకునెఱిఁగింపన్ వచ్చితిం జెచ్చెరన్.

క. కడుపునఁబుట్టిన కూరిమి
కొడుకు న్సుకుమారమూర్తిఁ గులవర్ధనునిన్
మెడఁగోసిచంపి నంజుడుఁ

గుడుపుల జోగులకుఁబెట్టు కూర్మిగలరే. 68

గీ. దానవుఁడుగాక వాఁడేటితండ్రి చెపుము
చెక్కునిండిన వసయొల్కు చిఱుతవాని
బత్తుఁడొక్కఁడు మధుపానమత్తుఁడగుచు
నిన్ను వేఁడినఁ జంపఁగ నిశ్చయించె. 69

వ. జీవన్భద్రాణిపశ్యతి యనువేదవచనం బవలంబించి యెక్క
డికేనింబోయి యీబారితప్పించుకొనుటనీకుంగర్తవ్యంబు.

చ. అనవుడునుం గుమారసిరియాళుఁడు వీనులు మూసికొంచునో
యనఘచరిత్ర నీకు నిటులానతియీఁదగునయ్య నీకుఁ గా
దని పలుకంగ నాకు భయమయ్యెడుఁగాక పరార్థమై తనూ
ధనము వ్యయింపఁగల్గుటకదా జననైకఫలం బెఱింగినన్.71

గీ. ఎఱుక సాలనివాఁడందుమే దధీచి
నల్పబుద్ధులె మేఘవాహనుఁడు శిబియు
ధరఁ బరోపకారార్థమిదంశరీర
మనెడువాక్యంబు వినవె సంయమివరేణ్య. 72

గీ. అధ్రువంబైన మలభాండమైనదేహ
మనఘ యన్యోపకారార్థమై వ్యయించి
ప్రవిమలంబుఁ గల్పాంతరధ్రువమునైన
కీర్తికాయంబుఁ గైకొంట కార్తియేల. 73

వ. అనిన జటాధారిజంగమప్రముఖుండు వీఁడు చిఱుతొండనంబి
కంటె నధికుండు పొమ్మనుచు మరలి పోయెనంత నక్కడ.

సీ. చిఱుతొండఁ డావృద్ధశివయోగిపుంగవుఁ
బ్రబలకుష్ఠవ్యాధి బాధితాంగు
వీపుమీఁదధరించి వెనువెంట గ్రుడ్డవ్వ
కోలూఁదికొనిరాఁగఁ గూర్చుకొనుచు
బూదిబొక్కణలాతమును కమండలువును
బులికళాసముఁ గరంబున వహించి
శరణీయు లెదురు రా శరణార్థి సేయుచు
నొయ్యొయ్య నందడికోసరిలుచు
గీ. చంద్రశేఖర భూతేశ శర్వ రుద్ర
పార్వతీనాథ శంకర భవగిరీశ
కాలకంధర హర కాలకాల యనుచు
వచ్చె నింటికి జనకోటి యిచ్చగింప. 75
మ. మహినూహింపఁగ నెంతభాగ్యమొకో యామ్నాయాంత
సిద్ధాంతవా
ఙ్మహిళాకుంతలమౌక్తికాభరణమున్ మందాకినీశేఖరుం
గుహానాభైరవు యోగిపుంగవుని భర్గున్ రాజమార్గంబునన్
వహియించెం దనవీపునం దిరముగా వైశ్యుండనాలస్యతన్.
ఉ. ఇంటికిఁ దెచ్చి యోగిపరమేశునకున్ వణిజుండు తాను వా
ల్గంటియుభక్తియున్భయముగౌరవమున్వినయంబునాత్మలో
నంటుకొనంగ నప్డు ముసలమ్మకు సైతము కమ్మనూనె మై
నంటి నలుంగుతో జలకమార్చి యొసంగిరిధౌతవస్త్రముల్.

వ. అనంతరంబ యేకాంతగృహంబున సర్వోపచారసంభారభరి
తంబుగా దేవతార్చనకుం బెట్టిన నయ్యాదిమదంపతు లిరువు
రు శివపూజావ్యాపారంబునం బ్రవర్తించుండి రప్పుడు శివా
జ్ఞావశంబునం జేసి. 78

ఉ. పల్లియచోటనుండి యెలపాసెము నక్కులుజిక్కిలంబులున్
బెల్లపుటచ్చులున్ సెనగబేడలుఁ జిమ్మిలి నువ్వుటుండలున్
బెల్లుగ నంబివియ్యములు పెద్దటికంబుఁ బ్రియంబునొప్ప మే
నల్లునకుం గుమారశిరియాలునకుం గొని తెచ్చి రమ్మలిన్. 79

వ. అంత. 80

సీ. ఫాలపట్టికయందు భస్మత్రిపుండ్రంబుఁ
గర్ణంబులను రాగికమ్మదోయి
కరమునం దిత్తడికంబంపుగంటెయు
ఘనభుజంబులమీఁదఁ గావిగంత
కటిమండలంబునఁ గరకంచుఁబుట్టంబు
మడఁచికట్టిన మేలి నడిమికట్టు
కేలుఁదామరయందుఁ గేదారవలయంబు
జడకుచ్చుమీఁదఁ బచ్చడపుగండ

గీ. సంతరించి పదాఱువర్షములవయసుఁ
బచ్చిబాలెంతరాలు తాపసపురంధ్రి
నంబిభామినిఁ దిరువెంగనాంచిఁ జేరి
పాలుపోయింపు మమ్మ పాపనికినని యె. 81

ఉ. మక్కువ రేఁగి నెయ్యపుఁగుమారునిఁ జంపుట కంతరాత్మయై
యక్కటికంబుపుట్టుటకు నల్లనవచ్చి భవాని యత్తఱిం
దక్కటిమాయజోగితవిధంబున బిడ్డకుఁ బాలువేఁడ నా
యక్కయుఁబోసె నెల్లసమయంబులఁబోలె నిరాకులాత్మయై.

వ. పాలువోయించుకొని కృపాళుమూర్తి యాఘూలినాంచారి
తిరువెంగనాంచితో నిట్లనియె. 83

మ. ప్రజలెల్లం బురిఁ గ్రంతక్రంతలమహాపాపంబుగాఁబల్కెడున్
నిజమో కల్లయొ కాని మీరఁటకడున్ నిస్త్రింశభావంబునన్
నిజపుత్రు న్సుకుమారుఁ జంపి యొకదుర్గిర్వాణికిం జోగికిన్
భుజియింపంగ నొనర్చువారఁటిదియెందుంగల్గునే యుద్ధరన్.

క. జోగులు కపటోపాయ
ప్రాగల్భ్యంబున నిధానవనసిద్ధులకై
యేగతులనైనఁ దిరుగుదు
రోగిరముగ సుతునిఁ జంపుటుచితమె వీరాకున్. 85

గీ. ఆవగింజంతభూతి మైలఁదికొనిన
వెలఁది గుమ్మడికాయంత వెఱ్ఱిపుట్టెఁ
కటకటా యెట్లు తనబుద్ధి కాటఁగలియ
నిసువుఁ జంపఁగఁ దలఁచెనో నీమగండు. 86

క. కానండుగాక కన్నులు
దానేమిటివాఁడు నీమతనయునిఁ జంపన్
ఘానవతీ "మగవాఁడో

మానో" యనుమాట నేఁటిమాటయె చెవుమా. 87

వ. అనినం దిరువెంగనాంచియక్కపటపుంజంగమదేవిమాటలు విననక నిర్వికారంబైనయాకారంబుతో నమ్మా శివుఁడన శివయోగియనభేదంబుగలదే శరణార్థులయర్థప్రాణంబులుశివాధీనంబులు శివుండుకర్త శివుండుభోక్త యీయర్థంబునకుం జింతింపనేల నీకుందడవయ్యెడు బాలెంతరాలవు బిడ్డయింతకెంతయలమటుఁజెందునో పాలుచాలుఁగదా యెప్పుడునూయింటికి వచ్చుచుం బోవుచుండునది నిండుకొనియుండుమనికేలుదోయి ఫాలంబునంగీలుకొల్పిసముచితవ్యాపారంబులం బ్రివర్తించుచుండం జంకు గానరాకపార్వతీదేవియునటనుండి చని యంతర్ధానంబు సేసె నాసమయంబున. 88

గీ. చేర నేతెంచి చిఱుతొండసెట్టి యంత
యింతి తిరువెంగనాంచితో నిట్టులనియె
నొజ్జలగృహంబునకుఁ బోయి యుత్పలాక్షి
వడుగుసేయంగవలెఁ బిన్నవానిఁ దెమ్ము. 89

చ. చెలువ కుమారుని న్వడుగుచేసినచేతడి యాఱకుండఁగాఁ
బొలుపెసలారఁగా నిరుగుపొర్గులవారల భాగ్యసంపదల్
కులమభివృద్ధిఁజెంద మనకూరిమినందనుఁ బెండ్లి సేయఁగా
వలయు ననంతరక్షణమ వైభవమొప్పఁగ ముక్తికన్యతోన్.

వ. అనిన నామెయు నట్లకాకయని యాచార్యగృహంబునవిద్యాభ్యాసము చేయుచున్న కుమారునిం దోడ్కొని వచ్చినంత.

ఉ. మంచిగ మేనయత్తలు శమాదరణం బడరంగఁబెట్టి పూ
త్రెంచిన మంచిభక్ష్యములు తేనియ నేతనుముంచిముంచిభ
క్షించుచుఁ దల్లిఁదండ్రిఁ దనచిన్నికరాంగుళివంచివంచియూ
రించుచును నిచ్చమీఱఁగఁజరించెఁగుమారుకుఁడింటిముంగిటన్.

వ. అనంతరంబ. 93

సీ. జడలయల్లిక యూడ్చి సంపంగినూనియఁ
బిన్నకూఁకట్లఁ జొబ్బిలఁగ నంటి
గోప్యదేశంబు సంకుమదద్రవంబున
నయమార నుద్వర్తనంబు సలిపి
గీసి గొజ్జఁగినీరుపోసి నూఱిన క్రొత్త
చిఱుబంతిపసుపులో చేవనలఁది
కస్తూరిఁ బొరపిన గంధసారంబుతో
నీకాయమెరుపున జిడ్డువిడిచి

గీ. తేట నులివెచ్చనీరునఁ దీర్థమార్చి
వేణి యీటార్చి సురపొన్న విరులుముడిచి
మడుఁగుఁగట్టి కాటుకయిడి తొడివిపూసి
భసితరేఖాత్రిపుండ్రింబు నొసటఁదీర్చి. 94

వ. కయిసేసి కుమారునిం గనుఁగొని జననీజనకు లిట్లనిరి. 95

ఉ. భైరవయోగి కొక్కనికిఁ బాశుపతవ్రతచర్యతీరునం
బారణకై నినుం బలలపాకముగా నొనరించి పెట్టుము
న్నారము భోజనంబు ప్రియనందననీహృదయంబునందు సం

సారముఁ బాయ జాలనివిచారము లేమగదా యొకింతయున్.
వ. అనినం గుమారసిరియాళుండు. 97
శా. సంసారభ్రమయించుకేనియునుమత్స్వాంతంబునన్ లేదుమీ
వంశం బీపరిపాటిదే యుఁబుగుఁడీ వైక్లబ్యసంభావనల్
మాంసాహారములయ్యెదక్షశివునకున్ మాయామహాయోగికిన్
హింసాక్లేశముమానుఁడీగురులుమీరేమిమ్ముఁబ్రార్థించెదన్
వ. అని పల్కెనప్పుడు. 99
గీ. చావ నియ్యకొనిన సత్పుత్త్రికునకును
జంప నియ్యకొనిన దంపతులకుఁ
దారతమ్య మెద్ది వీరమాహేశ్వరా
చారసమయమార్గ గౌరవమున. 100
వ. ఇవ్విధంబునఁ జందనికాపురస్సరంబుగా మువ్వురు నేకనిశ్చ
యు లయిరి తదనంతరమున. 101
సీ. పాలిచ్చుచాగునఁ బసిబిడ్డఁ దొడలపైఁ
మాత దాఁ బవ్వళింపఁగఁ బెట్టెఁ
జందనిక తనహస్తప్రణాలంబులు క్రింద
నంటుక సంతరించుకొనియెఁ
జిన్నిబుగ్గలు లేతచిఱుతనవ్వు వెలార్చ
సిరియాళుఁడు మొగిడ్చెఁ జేయిదోయి
చిఱుతొండనంబి క్రొమ్మెఱుఁగారు చురకత్తి
వాఁడిగానూఱును వంకదీర్చె

గీ. నేకమై యట్లు మువ్వురిహృదయములును
గుంద కానందవారిధియందుఁ దేలె
గురులు మువ్వురునుఁ గుమారవరునితోడ
నేకవాక్యంబుగాఁ బ్రీతి నిట్టులనిరి. 102

మ. మది శంకింపకుమన్న మావలని ప్రేమస్నేహవాత్సల్యసం
పద వాటింపకుమన్న నాలుకతుదిన్ బంచాక్షరీమంత్రము
బదిలంబొప్పఁ బఠింపుమన్న పరమబ్రహ్మార్థసంసిద్ధి యి
య్యదిసుమ్మన్న యనుంగునందన సిరాలావీరశైవవ్రతా.

ఉ. నంబి శివార్థము న్మనసునమ్మిక శంక యొకింతయేని చి
త్తంబునయందు లేక వనితామణియూరువుఁ బాన్పుఁ జేసి తీ
క్ష్ణంబగుకత్తి మోఁప మెడ గ్రక్కునఁ ద్రెవ్వ నమశ్శివాయ
మం
త్రంబు పఠింపుమండెను సిరాలుశిరంబు వసుంధరాస్థలిన్.

ఉ. కందక గాజువాఱక వికారముదప్పక మందహాసని
ష్యందము చెక్కుటద్దములజాఱక నెమ్మది నిద్రవోవుచం
ట్లందమునొందె ధాత్రి సిరియాలకుమారునివక్త్రచంద్రుఁ డా
నందమునొందెనప్పు డెలనాఁగమనంబును భర్తచిత్తమున్.

గీ. పన్నిదంబాడి గెలిచిన భావమొప్ప
నప్పు చక్కంగఁ దీర్చినయనువు మెఱయ
సతియుఁ బతియును గారంపుసుతు వసించి
వసుధ నడపిరి వీరశైవవ్రతంబు. 106

చ. మిరియము నుల్లియున్ బసుపు మెంతియు నింగువజీరకంబుశ
ర్కరయును జింతపండును గరాంబువుఁ గమ్మనినేయి తై
లమున్
బెరుఁగును మేళవించి కడుఁబెక్కువిధంబులఁ బాకశుద్ధి వం
డిరి సిరియాలునింగటికిడెందమునం దరళాక్షు లిద్దఱున్.

సీ. కమ్మగాఁ గాఁచిన కట్టునంజుళ్లను
నీరువెళ్లఁగనొత్తి నేతవేఁచి
చక్కఁగాఁదఱిగిన సన్నమాంసంబులు
పరిపాటిమై జుట్టుఁబదన వండి
మూల్గుటెమ్ములతోడ ముదుకగాకుండఁగఁ
జాఁదుసేసిన నల్లచాగుగాఁచి
వలయుసంబారాలు వడియాలు బలియించి
దళమైనక్రొవ్వుతోఁ దాలఁబోసి

గీ. షడ్రసోపేతములుగాఁగఁ జతురభంగి
నమృతపాకంబులుగఁజేసి రాక్షణంబ
సెట్టి సిరియాలు వంశాబ్ధిశీతకరుని
సతులు తిరువెంగనాంచియుఁ జందనికయు. 107

క. నానావిధపాకములుగ
నానాలుగఁజేసి యపుడు నాల్గువిధములన్
బోనాము దొంతిఁజేర్చిరి
సూనాస్త్రసమానుఁడైన సుతుసిరియాలున్. 108

సీ. నిగనిగంగాఁదోమి నిండుబోనముదొంతి
భోజనశాలలోఁ బొసఁగఁజేర్చి
చెలువ గొజ్జఁగనీటిచే పట్టుగావించి
పాటించి రత్నకంబళము పఱచి
దేవతార్చకు ధూపదీపాదు లొడఁగూర్చి
కప్పురంబున ముగ్గు గలియఁబెట్టి
యెడమదిక్కున రాగిపడిగెంబు ఘటియించి
గరగతో విమలోదకములుడించి
గీ. యతివ సర్వాయితంబయ్యె నయ్యగారి
కారగింపఁగ నవసరంబనుచుఁ బలుక
సెట్టి తోడ్తెచ్చె జంగమసిద్ధవృద్ధు
నంధురాలగు ముదుసలియవ్వతోడ. 110

క. శ్రీపాదంబులు గడిగెను
శ్రీపాదోదకము గొనియెఁ జెలువయుఁ దానున్
వ్యాపారిసార్వభౌముం
డాపరమతపస్వి నునుచి యర్చించెఁదగన్. 111

వ. అనంతరంబ చిగురు ముదురునుంగాని నిడుపు వెడల్పుంగల కదళీపలాశంబునడిమి యీనియఁ బుచ్చి పఱచి యుదకంబునం బ్రోక్షాళించి యుపస్తరించి పాయసాపూపసూపపుండ్రేక్షు ద్రాక్షాగోక్షీరమధుశర్కరాఘృత దధిరసావళీశాకపాకశిఖరిపానకంబులతోడ గారాపుంగొడుకుపోల మే

లోగిరంబుతోడం గూడ భరితభోజనంబుగా వడ్డించి గుడ్డి యవ్వకు నైత మట్లే సమర్పించి దేవభక్తవత్సల శివ యోగీశ్వరరూప విరూపాక్ష యమృతాహారం బారగించి రక్షింపుమని చిఱుతొండండు భార్యయుం దాసును భక్తి తాత్పర్యవిశ్వాసపురస్సరంబుగా నమస్కరించిన. 112

ఉ. భైరవయోగిరాజు పసిపాపనినంజూఁడు గూర లందులో
నారసిచూచి మస్తకమునందలి మాంసములేమిగాంచియా
నీరసమాంస మేటికి వణిగ్వర పుత్త్రునియుత్తమాంగముం
గూరలు సేయవైతి వివిగో నిజపుత్త్రనిసర్గమోహముల్.

గీ. కటకటా మావ్రతంబు భగ్నంబుఁ జెందె
నేఁటిపారణ యిది మాకు నేఁటికింక
నుత్తమాంగపుమాంసము నుజ్జగించి
యేల యధమాంగమాంస మే నెటుభుజింతు. 114

వ. అనిన విని చిఱుతొండండు భయంపడి వెలవెలంబాఱుచుఁ దిరువెంగనాంచివదనం బాలోకించి యింక నెట్లనినం జిట్టుముట్టుచునంతఁ దలకాయపాల మేలోగిరంబు ముందటం బెట్టి చందనిక యిదియేను మొదలన బెడందకాండ్రగు యోగిబృందారకులచందం బెఱింగినదాన నగుటం జేసి పాకంబుఁ జేసికొనియున్నదానఁ దపస్విచిత్తం బేపాకంబునుం బొందకుండ నడ్డింపెదం గాకని యట్లుచేసిన నక్కపాలా భైరవుండు వెండియు. 115

గీ. ఒంతి నీవారగింపక పరమపుణ్య
నాకుఁ జేయాడునే భోజనంబు సేయ
నొకఁడుభుజియించు టెన్నఁడు నొప్పదనెడు
వేదవాక్యార్థమున్నది వినవె చెపుమ. 116

వ. మఱియు నొక్క భోజననియమంబు కలదు పిన్నవాఁడు బంతి భోజనంబు సేయక కూడు నోటికిం బోదు మగబిడ్డండు లేనిని ర్భాగ్యునింట భోజనంబు సేయఁగూడదు నీకుమారునా బంతి కి రప్పింపు మారగించెద మనవుడు. 117

మ. మొదలం దేవర యానతిచ్చితిర యేముంజిత్త మందెంతుమ య్యది నాకుంగొడు కింకనుంగలఁడె వాఁడాడంగ వేంచేసెనే చదువంబోయెనె పిల్వఁబంతు నెటు నేజాడం బ్రతీక్షింపనీ యదనం గూరలు చల్లనారవె మహాత్మా యోగిచూడామణీ.

వ. అనిన నత్తపోధనుఁడిట్లనియె నీయుత్తమాంగనయెలుంగెత్తి నలుదిక్కులం బిలుచునది కుమారుండు వచ్చెనేనిబంతింబెట్టు కొని భుజింతము రాకుండెనేని నేమునునీమునలియవ్వేయుం గుడుతమటుగాక యొఱగొడ్డెంబులు వలికి నీపడ్డపాటుగొడ్డే ఱుఁగా జడ్డుపఱుపం గలవారమె యనినం బ్రసాదం బనిపతి యనుమతిం బురంధ్రీరత్నంబు. 119

సీ. రారా వణిగ్వంశ వారాశిహిమధామ
రారా వికస్వరాంభోరుహాక్ష

రారా మహాఘోరవీరశైవాచార
రారా ఘనౌదార్య రాజరాజ
రారా కుమారకంఠీరవేంద్రకిశోర
రారా సమగ్రధీరౌహిణేయ
రారా మనోభవాకార రూపవిలాస
రారా యసారసంసారదూర

గీ. రార నావన్నివడుగ రారాతనూజ
రార సిరియాల రార నాప్రాణపదమ
రార నాకుఱ్ఱ నాజియ్య రారయనుచుఁ
జీరెఁ గారాపుఁగొడుకు రాజీవనయన. 120

శా. అత్తన్వంగి సమస్తదిక్కులను పర్యాయక్రమంబొప్పఁగా
నొత్తెం జిన్నికుమార రారయనియత్యుచ్చైశ్శ్రుతింజీరినం
జిత్తంబుం గనవచ్చెఁ బాలుఁడు మహాశీఘ్రప్రచారంబునన్
దత్తద్వ్యంజనపాకగంధ్యవయవస్థానప్రతానంబుతోన్. 121

శా. రక్తాపాంసుర మైనదేహము సహగ్రైవేయముం గంధరా
కుక్షిం గప్పును బ్రిస్ఫురద్ఘనజటాకోటిన్ శశాంకార్ధముం
జక్షుఃపద్మముతోడ ఫాలతలమున్ సంధిల్ల శంభుండు ప్ర
త్యక్షుంబయ్యె సిరాలుతండ్రికి హృదాహ్లాదంబు సంధిల్లఁగన్.

వ. అప్పుడు భయభక్తితాత్పర్యంబులు మనంబున ముప్పిరిగొన
నప్పరమమాహేశ్వరుం డిట్లని స్తుతియించె. 123

మ. జయహాలాహలనీలకంధర మహేశా భక్తచింతామణీ
జయ గంగాధర చంద్రశేఖర జగత్స్వామీ కృపాంభోనిధీ
జయనీహార ధరాధరేంద్రతనయాచారుస్తనద్వంద్వసం
శ్రయసంలగ్నపటీరకుంకుమరజస్సంపన్న బాహాంతరా. 124

వ. అని మఱియు ననేకప్రకారంబులం బ్రస్తుతించె నిట్లు ప్రత్యక్షుండైన విరూపాక్షుండు చిఱుతొండనంబీ నీవృత్తాంబురుండవు సిరియాళుండు కుమారస్వామి తిరువెంగనాంచియచ్చర మీరిద్ద ఱొకొక్క కారణంబున మర్త్యయోనిం జనించితిరి మీమీస్థానంబుల నుండి తొంటిచందంబున నన్నుంగొలువుండు శరీరంబులతోడం గైలాసంబునకుం రండని యనుగ్రహించిన. 125

సీ. వైశ్యాన్వయంబున వసుధ వర్తకెక్కి
వేయిగోత్రంబుల వినుతిఁగాంచి
వీరమహేశ్వరాచారంబు వదలక
యేడుపాడలవార మేముగలసి
వర్తిల్లుదుము వాసి వట్టమేమియులేక
యిట్టిబంధులఁ బాసి యేనొకండ
రా బుద్ధిరాదు తారకరాజశేఖర
యిందఱఁ గొనిపోయితేని వత్తుఁ

గీ. గూర్చుకొనిపోవు నీకోడఁగూడె నేని
నట్లుగాకున్న విచ్చేయు మభవ మరలి

ప్రమథసన్నిధి కేమియు బాధలేదు
కొలిచెదము నిన్ను మే మెల్లఁ గూడిమాడి. 126

వ. అనిన శంభుండు కరుణించి యేడువాడలుఁ గదలివచ్చునది నీకుం బ్రియంబగు నివ్వరం బిచ్చితి నని యానతిచ్చిన త
త్క్షణంబ. 127

గీ. కంచితో నేడువాడలఁ గలిగినట్టి
నాకొఫుంగోమటులతోడ నంబిసెట్టి
యఖిలజీవరాసులఁ గూడి యభ్రవీధి
భాసురస్ఫూర్తి నేఁగెఁ గైలాసమునకు. 128



# వీరమహిమ

## రణవీరుఁడు.

### (బభ్రువాహనుఁడు.)

సీ. పద్మరాగోపల ప్రాకారభాసురం
బారసాతల పరిఖావృతంబు
ప్రోత్తుంగహేమగోపురపరిష్కారంబు
పటురత్నసౌధవిభ్రాజితంబు
వినుతవర్ణాశ్రమ విశ్రమస్థానంబు
చతురంగవాహినీ సంకులంబు
వివిధవస్తువ్రాత విరచితాపణకంబు
బహుతటాకారామ పరిసరంబు
ప్రతిదినోత్సవదేవతాభవనఘటిత
లలిత మంగళవాద్య కోలాహలంబు
బభ్రువాహనభుజపరిపాలితంబు
మానితైశ్వర్యధుర్యంబు మణిపురంబు. 1

చ. అనుపమ మైనతద్విభవ మంతయుఁ జూచి *మరాళకేతనుం

* మరాళకేతనుండు = హంసధ్వజమహారాజు ; శ్రీకృష్ణభక్తుఁడు ; అర్జునునికి నెచ్చెలి యైనవాఁడు.

గనుఁగొని పార్థు డగ్రకటకం బది యెవ్వనిదన్న నవ్విభుం
డను భవజాత్మసంభవుఁ డహర్పతి తేజుఁడు బభ్రువాహనుం
డనునరనాథుఁ డేలు సముదగ్రతమైన నిజరాజధానిగన్. 2

చ. ప్రకుపితవైరివీరనరపాలసమున్నత కంఠలుంఠన
క్రకచ మితండు నేమొదలుగా నిట గల్గుసమస్తభూమిభృ
న్నికరము నిక్కుమారవరునిన్ భజియించుసహస్రసంఖ్యహా
టకభరితంబులైనశకటంబు లుపాయన మిచ్చి నిచ్చలున్.

క. సుతజనకబాంధవంబున
నతఁ డూరకయున్న లెస్స యటుగాక సము
ద్ధతిఁ దురగముఁ బట్టిన నే
గతి మఱి విడిపింప వశముగా దెవ్వరికిన్. 4

క. అనునెడ సుబుద్ధి యనున
జ్జనపతిసేనాని ఖురళిసంభ్రమ మెసఁగన్
జని మడుగుత్రోవఁ బ్రమదం
బున మెలఁగెడు నమ్మఖాశ్వముం గని పట్టెన్. 5

వ. అయ్యవసరంబున. 6

శా. సామామోదవినోదిదైవనియెధాస్వంతుండుశాకుంతమా
రామక్ష్మోణిరుహాగ్రనీడముల నాక్రందించె నాకాశవీ
థీమధ్యంబునఁ దారకాగణము సందిగ్ధచ్ఛవిం బొల్చె ది
క్సీమాగోళము నంతకంతకును గొంచెంబయ్యె లేఁజీఁకటిన్.

క. సరసిజబాంధవుఁ డీ తి

చరమాంబునిధివీచికావశంవదుఁ డైనన్
దురగంబుఁ గొనుచుఁ బురమున
కరుదెంచె సుబుద్ధి వేడ్క నాసమయమునన్. 8

సీ. కురువిందమయకుడ్య కుట్టిమంబులచేతఁ
బగడంపుఁ జేవకంబములచేతఁ
దళతళ మెఱయు దంతకవాటములచేతఁ
గనకసోపానమార్గములచేతఁ
దోరంపుముత్యాల చూరుమొగ్గలచేత
జిగిమించుసాలభంజికలచేత
మృదులాంబరంబుల మేలుకట్టులచేత
సరిలేనిధూప వాసనలచేత
మహిమఁ బెంపొందు నాస్థానమంటపంబు
నందు మూర్ధాభిషిక్తులు సందడింప
బభ్రువాహనుఁ డధికసౌభాగ్యగరిమ
గడలుకొన రాత్రి పేరోలగముననుండి. 9

చ. క్రమమున సప్తిరక్షకులు క్రిందుకొనం గరదీపికాసహ
స్రములు వెలుంగఁ జిత్రపటచామరహేమఖలీనకింకిణీ
కములగునుత్తమాశ్వములఁగన్గొనుచుం డెడుచో సుబుద్ధిభూ
రమణునిఁగాంచియత్తురగరత్నముఁగానుకపెట్టిమ్రొక్కినన్.

గీ. అవ్విభుఁడు దానిరేఖ కాహ్లాదమంది
కదియఁ దెప్పించి చూచి మొగంబు నిమిరి

ఫాలసంస్థితకలధౌతపత్త్రలిఖిత
చారుతరశబ్దబంధంబు చదువుకొనియె. 11

ఉ. దుర్జయరాజమండలవిధుంతుదమూర్తి యుధిష్ఠిరక్షితీ
శ్వర్జిత మైనయజ్ఞహయావతంసము త్రిపుర సంగరకుగా
నర్జును జేఁగుదెంచె నిటలాక్షునిగెల్చినజోదు విక్రమో
పార్జితలీలఁ బట్టుఁడు రయంబున శూరులు ధాత్రిఁగల్గినన్.

వ. అని పఠించి. 13

ఉ. భూపకుమారుఁ డిట్లను సుబుద్ధిఁ గనుంగొని సాదరంబుగన్
మా పెదతండ్రి ధర్మజుఁ డమానుషవిక్రముఁ డశ్వమేధదీ
క్షాపరతంత్రుఁడై విడువఁగా నిటవచ్చిన దీహయంబు నా
నాపురవాటికావిహరణంబుల మజ్జనకుండు తోడుగన్. 14

మ. శివుతో నెక్కటికయ్యముం దొడరి మెచ్చించెన్ బ్రతాపించి వా
సవునర్ధాసనమెక్కె వేలుపులు మెచ్చం గాలకేయాదిదా
నవులం గీటడఁగించె నట్టిత్రిజగన్మాన్యుండు చిత్రాంగదా
ధవుఁ డిచ్చోటికి నేఁగుదెంచెనఁట మద్భాగ్యంబు సామాన్యమే.

క. కావున మన మెదురుకొనం
గావలయు సమస్తసైనికవ్రాతముతో
నీ విందుకుఁ దగుయత్నము
గావింపుము వెసఁ బ్రభాతకాలంబునకున్. 16

గీ. అనుచు సేనాని వీడ్కొల్పి యక్ష్మాభంగి
జనపతుల నెల్ల నిజవాసముల కనిపి

సవనహాయము సాహిణులవశంబుఁ జేసి
యంతిపురమున కరిగె భూకాంతుఁ డపుడు. 17

వ. అంతం బ్రభాతసమయంబగుటయు నక్కుమారవరుండు సముచితపరికారంబున బహువిధోపాయనపురస్సరంబుగాఁ బురంబు నిర్గమించి. 18

సీ. తర్కించి హేమభూధరముఁ దేఁడనికాని
సౌవర్ణవితతికి సంఖ్యలేదు
లక్షించి మలయశైలమ్ముఁ దేఁడనికాని
గంధసారమునకు గణనలేదు
దట్టించి గంధమాదనముఁ దేఁడనికాని
ఘనసారపాళికి గడమలేదు
చర్చించి రోహణాచలముఁ దేఁడనికాని
వివిధరత్నములకు వెలితిలేదు
నాఁగఁ దనవీటఁ గల్గునానావిశేష
వస్తువులతోడ నర్ఘ్యరాశ్వంబుఁ గొనుచు
వచ్చి వాహంబుడిగ్గి, విర్వచ్చుఁ గాంచి
బభ్రువాహనుఁ డందంద ప్రణతిఁ జేసి. 19

ఉ. అప్పుడ మౌక్తికాంజలిఁ బ్రియంబునఁ జేయుచు దేవనిన్నకై
తప్పునఁ జేరె నీహయము తండ్రికి నోర్వకపోదు బిడ్డఁ డే
యొప్పమిఁ జేసెనేనియు ననూనకృపామతినన్నుఁ జూచి యా
తప్పుసహింపుమంచువసుధాస్థలిఁ జాఁగిలిమ్రొక్కెఁ గ్రమ్మఱన్

ఉ. మ్రొక్కిన నాదరింపక నరుండు వియన్నది శాపవాక్యముల్
ద్రొక్కిన నాగ్రహంబుఁ బలేక కుమారునిఁ దన్నెఁ దన్నినన్
గక్కసమొంద కాతఁ డవికారత నిల్చిన రాజు లందఱున్
గ్రక్కన నాప్తవాక్యములుగా నపుడిట్లనిరిందరిసూతికిన్. 21

సీ. తనయునిఁ గృపఁ జూడుమనియె సాత్యకి యింత
కలుషింపఁ జనదనెఁ గర్ణసుతుఁడు
హంసకేతనుఁ డిది యవకార్యమని చెప్పె
నీలధ్వజుండు మన్నింపుమనియెఁ
బనిలేనిపనియని పల్కెఁ బ్రద్యుమ్నుండు
కృతవర్మ తగ దపకీర్తియనియె
ననుసాల్వుఁ డనియె భావ్యంబుగాదని యూవ
నాశ్వుఁ డీచంద మపాయమనియె

గీ. మఱియుఁ దక్కినరాజులందఱును వేన
వేలభంగుల నీరీతి విన్నవింప
నాదరింపక మదిఁ గోపమంతకంతఁ
కడరఁ బార్థుఁడు బభ్రువాహనునిఁ జూచి. 22

ఉ. ముంగలఁ బాఱుతెంచుహయమును గనిపట్టి పిఱుందవచ్చుసే
నంగని పార్థిఁడభీతిఁ గదనంబునకుం జొరవైతివోరి మా
వంగడమాట బొంకు మసవై శ్యునకుంగనెఁబోలునిన్నుఁజా
తాఁగద యన్నఁ బొక్కిపడి యానృపసూనుఁడు పల్కెఁ
దండ్రితోన్. 23

మ. నను నేమన్నఁ గొఱంతలేదుసభలోనం బుణ్యచారిత్రమౌ
జ్జననిం దప్పఁగనాడి తీనికృతికిన్ సైరింపఁగానేర నా
వినయంబింతకుఁ దెచ్చె జాలుఁబలుకుల్వేయేలనేఁడుత్రియుం
డనో వైశ్యుండనో చూడుమంచుమగిడెన్సంగ్రామసంరంభియై.

చ. అపుడుసుబుద్ధిసైన్యముల నన్నిటినొక్క మొగంబుగా నమ
ర్చి పురికిఁ గానికల్ మగుడఁద్రిప్పి జయావహఝల్లరీమృదం
గపటహరావముల్ దిగిభకర్ణపుటీకుటికాంతరంబులం
దుపహతిఁ జేయఁ దక్రితుహయోత్తమ మొక్కెడఁగట్టఁ
బంపుచున్. 25

సీ. కల్పితధ్వజఘంటికామాల్యసముదీర్ణ
హేమశతాంగంబు లేడుకోటు
లోకయర్బుదము మదవ్యాఘనిరాఘాట
సన్నాహ్యములు భద్రసామజములు
చటులధాటీసముద్భటమనోజవనిర్జి
రోధవాహంబు లర్బుదయుగంబు
మూడర్బుదములు సముద్యద్భుజాటోప
విజయఘోరేయులు వీరభటులు
క్రందుకొన సైన్యనాయకాగ్రణి ఘటించెఁ
గాలచక్రసమాకృతిగాఁ గపీంద్ర
కేతుబలనాశకరధూమకేతువనఁగ
సాహావభయంకరం బైనమోహరంబు. 26

చ. అనుపమరత్నబంధురము హాటకనిర్మితమున్ మయూరవా
హనపరిశోభితంబు వివిధాయుధగర్జితమున్ విచిత్రకే
తనరుచిరంబు నైనయరదంబు ముదంబున నెక్కి బభ్రువా
హనుఁడు తదగ్రభాగమున నాయితమై నిలిచెం జలంబునన్.

శా. ఆరీతి న్నరనాథసూతి కృతజన్యారంభుఁడై నిల్వ నా
సీరస్ఫారబలంబు లొండొరు లధిక్షేపంబు లేపారఁగా
వీరావేశభరంబునం బెనఁగె విద్వేషించి ప్రాక్పశ్చిమాం
భోరాశుల్ దలపడ్డచందమున నార్పుల్ మింటితో నంటఁగన్.

క. ఈలీల దురమొనర్పఁగ
వాలినదర్పమున బభ్రువాహనధరణీ
పాలుండు తేరు గదియం
దోలించి సురేంద్రతనయుతో నిట్లనియెన్. 29

చ. తనయుఁడఁగాన నీచరణతామరసంబులు భక్తిఁ గొల్చువే
డ్క నరుగుదెంచినం గడవఁగా నటులాడితి వాడుటెల్ల మ
త్పునిశితబాహువిక్రమము చూచుతలంపునఁగాదె తీర్త నీ
మనికితమిప్పుడందుకొనుమా నిజకార్ముకమంచుఁ బల్కినన్

మ. అనసాల్వ్యంశప్రడక్కుచూరు నెదిరించా కర్ణరుక్పుంఖమం
డనుఁడై ఘోరనవాంబకంబులు నిగుడ్పన్ వానిలెక్కింపకా
తనిమీఁదం జడిగొల్పె నాజుశుకపత్రద్యోతశాతాస్త్రముల్
కినుకన్ వ్రేఁడవిత్రుంచితో డనపయిన్ గీల్కొల్పె బాణౌఘముల్.

క. ఈచందంబునఁ బటునా

రాచపరంపరలఁ దొరఁగురక్తంబులచేఁ
బూచినమోదుగులకు నెన
యై చేసిరి దురము త్రిజగదాభీలముగన్. 32

క. గద కేలంగొని ధర గ్రి
క్కదలఁగ ననుసాల్వుఁ డెదురుగా నడచ నవ
ప్రదరములు బభ్రువాహనుఁ
డెదనించిన వ్రాలె నాతఁ డెత్తినమూర్ఛన్. :3

వ. అప్పుడు. [ప్రం

శా. ప్రద్యుమ్నుండనుసాల్వపాటునకు నుగ్రంపశ్యుఁడై హేమ
ఖద్యోతాశుగపంక్తులేయ నపు డల్కన్ బభ్రువాహుండవి
చ్ఛేద్యప్రౌఢిమఁ బేర్చి తత్తనువు ముంచెన్ బాణవర్షంబునన్
సద్యోమగ్నము గా ననంగుఁడగుటన్ స్వాభావికార్థంబుగన్

ఉ. ఈసరవిం బరస్పరజయేచ్ఛల నెండియు దివ్యబాణవి
న్యాసపటుప్రహారకరణంబులఁ జక్రగదాపరశ్వథ
ప్రాసకృపాణఖేటములఁ బట్టి పెనంగిరి బాహుశౌర్యముల్
త్రాసునఁదూఁపవచ్చుననఁ దక్కువయెక్కువలేకయుద్ధతిన్.

క. నిండినమూర్ఛల ధృతకో
దండనమత్కోటిభూషితశిరోధులతో
నుండునెడ బభ్రువాహుఁడు
గాండివగుణరావబోధకరనుతిఁ దెలిసెన్. 37

గీ. అట్లు తెలివొంది బభ్రువాహనుఁడు పాండు

తనయుఁ గదియంగ నరదంబుఁ దఱుముకొనుచు
వచ్చునప్పుడు రాఘవేశ్వరుఁడుఁ గుశుఁడుఁ
గయ్య మొనరింపఁ గదిసిన ట్లయ్యె నంత. 38
చ. కినుక సువేగుఁ డడ్డపడి క్రీడికుమారు నురంబుగాడ బా
ణనవక మేసి మూఁడుబలునారసముల్ దొడిగాతపత్రమున్
ధనువుఁ బతాకయుం గెడపి తద్రథయోధసహస్రమున్ బృష
త్కనిహతిఁ గూల్చుచున్ దశశతప్రదరంబులముంచె నాతనిన్
వ. ఇవ్విధంబున సువేగుండు శరవేగంబు చూపిన. 40
మ. సురరాట్పౌత్రుఁడు దావపావకపరిస్ఫూర్తిన్ విజృంభించి ని
ర్భరశౌర్యోన్నతి వానిబాహుబలగర్వప్రౌఢి వారించుచున్
శరజాలంబుల శుభ్రవారణఘటాసంఘంబులం ద్రుంచి త
త్కరిమూర్ధాశ్వకళేబరోత్కరములన్ గప్పెన్ సమిద్భాగమున్
ఉ. వెండియు నాగ్రహంబున సువేగునిమధ్యము ద్రెవ్వ వొక్కబ
ల్కొండ మడర్చి వానికరలాఘవ మేమనిచెప్పఁ దూచిన
ట్లుండ సమంబుగాఁ దెగి రణోర్విపయింబడ కంతలోఁ జతుః
ఖండములై సురల్ బెదరఁ గవ్వడిపట్టి యురంబుదాఁకినన్.
క. నిలుపోప కతఁడు మూర్ఛా
కలితుఁడగుచుఁ దోన తెలిసి ఘనభుజశక్తిం
బొలియించెఁ బార్థయోధవ
రులఁ బలువురఁ బ్రళయకాలరుద్రుఁడుఁ బోలెన్. 43
గీ. బభ్రువాహనుచే నాజిఁ బడినదొరలఁ

దత్పురంబునఁ జితాగ్రింగదాసపత్ని
యగునులూచి క్రమంబున నరయుచుండెఁ
దగువిశల్యాది వివిధౌషధములచేత. 44

సీ. అపుడు ధనంజయుం డనువృషకేతుతో
సైన్యనాశమకాక సకలవస్తు
వులు నష్టమయ్యె నీవును నేను శేషింపఁ
బడిరి హంసధ్వజప్రిముఖు లాజిఁ
బ్రద్యుమ్నుఁడును బట్టువడియె నయ్యనుసాల్వ
క్రిమ మేమియును గానరాకపోయెఁ
దనతనుచ్ఛాయ మస్తకహీనమై తోఁచెఁ
గనుఁగవ విస్ఫులింగములు దొరఁగెఁ
దుర్నిమిత్తంబు లివిగాక తోఁచెఁ బెక్కు
చావునకు నింక లంకెగాఁజనదు మొదల
నస్త్రజర్జరితాంగుఁడ నన్వయాభి
వృద్ధికై నిల్వ నీవైన విద్రుప నీరు. 45

వ. అసిపత్త్రివ్రితదీక్షాపరుండై పాండవాగ్రిజుండు మద్భుజా
విక్రమంబు నిర్వకరింబగునని యొనర్చినకరితూపకరిమం
బపక్రమంబయ్యె మదీయజీవనం బప్రయోజనంబు సంగర
మరణంబ శరణంబు నీవు కృష్ణధర్మజులపాలికింజను మనిన
వృషకేతనుండు కపికేతనున కిట్లనియె. 46

మ. పలుకు ల్వేయునునేలతూలి రవిబింబం బుర్విపై వ్రాలినఁ

గలఁక నైన్వైరికి వెన్నుసూపుమనెమూఁకల్ గట్టిబృందారకుల్
దళపడ్డన్ బలిమిన్ జయింపఁగల నేతన్మాత్రు లీశాత్రవుల్
నిలువన్ శక్తులె నన్నెదిర్చి కలనన్ నీప్రాపు నాకుండఁగన్.

క. ననుఁ జిత్తగింపు మని చ
య్యన ద్రొక్కి రథాధిరూఢుఁడై భుజగర్వం
బున బభ్రువాహు నెదిరిం
చెను వృషకేతుండు రెండుసేనలుఁ బొగడన్. 48

మ. నరరాధేయతనూభవుల్ మఱియునానాదివ్యబాణంబులన్
సరిపోరన్ వృషకేతనుం డనలపర్జన్యాంతకార్కాదిని
ష్ఠురనారాచపరంపరం బొదువ నాటోపంబుమీఱన్ బురం
దరపౌత్రుండవిత్రుంచె నన్నియును దా నారాయణాస్త్రం
బునన్.

గీ. కర్ణజునిఁ జూచి యిట్లను గార్ష్ణి యపుడు
పోలిసె నీసేన మద్భుజావిలసనమున
వృత్రుఁ డమరేంద్రు నెదిరించువిధముగాక
యెందుఁ బోవచ్చు నీవు నాయెదురననుచు. 50

మ. పరిహాసంబున బభ్రువాహనుఁడు రాధాపౌత్రుమూద్యద్భుజాం
తరమున్ దూఱ మరుచ్ఛిలీముఖముసొన్పన్ దూలిబ్రహ్మాండక
ర్పరముం దాఁకి ధరిత్రిపైఁ బడక సర్వత్ర్యభ్రవాశావధిన్
శరఘుల్ చుట్టుకముమ్మ్రహార్తమున కాజన్యస్థలిన్ వ్రాలుచున్

సీ. కుమరుఁ గాని కర్ణజుఁడు గ్రీడికొడుకనుచు

శాత్రవహతినొంప నతఁడుఁ జోద్యముగఁ దరణి
బింబ మొరయంగ నెగసి రథంబు దిరిగి
పడియె ధరమీఁద సంపాతిపక్షివోలె. 52

వ. ఇత్తెఱంగునం బడినబభ్రువాహను నవలోకించి. 53

చ. తొడరి మరాళకేతనునిఁ ద్రుంచినదుష్కృతిఁదీర్తునంచుబ
ల్విడి వృషకేతనుం డురుశిలీముఖము న్నిగిడింపఁద్రుంచి క
వ్వడితనయుండు బిట్టెగసి వానిపయిం దరికొంఁడకై వడిన్
బడిపడి గెంటి వింట శరపంచకముం దొడిగేసియార్చినన్.

గీ. క్రీడితోద్భుత సము వృషకేతనుండు
అరద మిలఁ గ్రుంగ రాధేయునంతవాఁడు
నిలువుమనె నిన్ను నివ్వీరునలవుగంటె
యొక్క మొగిన ప్రతాపించుచున్నవాఁడు. 55

క. అనునెడఁ బార్థుఁ డొకశర
మునఁ బగిలిచెఁ గర్ణసుతుని మూర్ధమతఁడు నా
తని ముంచెఁ బెక్కుశరముల
జనమేజయ యిట్లు భయదసమరం బయ్యెన్. 56

చ. అరుదుగధాత్రిఁగొంతదడవంబరమార్గమునందుఁగొంతపో
ద్దరదము లెక్కియున్ విరథులయ్యును బోరిరిపంచరాత్రము
ల్నరములు తచ్ఛరీరపలలంబులఁ ద్రెంచుక పాఱ నల్గడన్
గెరలియుహార్నిశంబుఁదమకింపుచుఁ బైకొనఁగాకఘూకముల్

క. ఇప్పగుపన నయ్యెకపుప

దెప్పరముగఁ బోరునెడఁ గడిఁది బాణములన్
నొప్పించి బభ్రువాహనుఁ
డప్పుడు వృషకేతుఁబలికె నాగ్రహ మెసఁగన్. 58

క. ఇన్నిదినంబులు మార్కొని
నన్నెదిరితి నిలిచి మేలనందగుఁ గలనన్
నిన్నుఁ బొరిగొనక విడువ మ
దిన్నిలుపుము నేఁడు వాసుదేవుని ననుచున్. 59

చ. కనుఁగొని యర్థచంద్రవిశిఖం బడరించినఁ గర్ణసూతి ము
త్తునియలు సేయుచుం జెలఁగఁ దోడనె హేమవిచిత్రసాయకం
బున వెడద్రుంపఁ దచ్ఛిరము మొండెము పై నటియించి చెండు
భం
గి నెగసి కృష్ణుఁ బేర్కొనుచుఁ గ్రీడి పదంబులమీఁదఁ ద్రావాలినన్.

గీ. అక్కబంధంబు వడుచుఁ బ్రత్యర్థిసేన
నచ్ఛుతంబుగ మడియించె నపుడు పార్థుఁ
డతనిమణికుండలాన్విత మగుశిరంబు
కరమున ధరించి మిగుల శోకము వహించి. 61

సీ. రక్తాక్తమౌక్తికారాతి మూర్ధాబ్జాంఘ్రి
శాలి నాఁటడి రిత్తఁ జంపికొంటిఁ
బుత్త్రపౌత్త్రాలంభమునకు మైకొని యబ్జ
హితునితోడ విరోధ మియ్యకొంటి
నభిమన్యుపిమ్మట నవ్వయస్థితికి నె

న్నఁగ నీవు గలవని నమ్మికొంటి
గుణనిధానము నిన్నుఁ గోల్పోయి హరి యుధి
ష్ఠిరులచిత్తముఁ దప్పఁజేసికొంటి
నకట మఖవాజి సాధించినపుడు భీము
నెదురఁ బ్రతిపక్షులను సమయించి నేఁడు
నాకుఁ దోడయి వచ్చి జన్యమున సమసి
యిచటఁ బక్షులపాలైతివే కుమార. 62

వ. అని ధనంజయుండు తచ్ఛిరంబు శరీరంబునం జేర్చి మూర్ఛి తుండై తెలిసి బహుప్రకారంబులం బలవింప నతనిం గనుంగొని బభ్రువాహనుం డిట్లనియె. 63

గీ. వైశ్యజుఁడఁగాన సంగ్రామవనధిలోని
వీరకోటీరమణులకు విలువగంటేఁ
గర్ణసూనునిశిర మనర్ఘంబు దీని
భవున కర్పించి పడయుము పాశుపతము. 64

క. అన విని కిరీటి కర్ణసు
తునిమస్తము రథముపైఁ గుదుర్పఱచి మదిం
గనలుచును బభ్రువాహనుఁ
గని యిట్లనుఁ జటులసజ్యగాండివధరుఁడై. 65

చ. బిరుసుగ నేటికిన్ దఱచు పేర్మిలెను శూరుఁడవైన నిల్చి నీ
పరుసఁదనంబు చూపుమని పాండుతనూజుఁడుచిత్తజల్లుగాఁ
గురియుపమోఘశరంబుక్రియ ఘోరశిలీముఖవృష్టి ముంచినన్

పురమున బభ్రువాహనుఁడు దూలెబలంబులు గూలెనల్గడన్.

శా. మూఁకల్ గట్టిన యోధయూధపహరుల్ మొండెంబులై రాలఁగా
దూకంబుల్ సెడి తేరులాకసమునన్ దూలంబులై తూలఁగా
నాకాంతేయుశరాగ్ని మించి జటిలంబై గోపురాట్టాలక
ప్రాకారంబులు మున్నుగా మణిపురిన్ భస్మంబు గావించినన్.

శా. ఆసంరంభము బభ్రువాహనుఁడు బాహాశక్తి మాయించితో
డ్తో సూతాశ్వకపీంద్రులన్వరుసమూఁడున్నాల్గునేనమ్ములన్
వే సోలించుచు నుగ్రభల్లముల నవ్వీరుండు గారింపఁగా
గాసిం బొందెఁ గిరీటి సన్నిహితగంగాశాపసంవిష్టుఁడై. 68

క. అవ్వేళ దివ్యబాణము
లెవ్వియుఁ బనిసేయకున్న నెదవడి మదిలోఁ
గవ్వడి దూలఁగఁగని యెల
నవ్వుచుఁ జిత్రాంగదాతనయుఁ డిట్లనియెన్. 69

శా. మాతల్లిన్ వనితామతల్లిని సభామధ్యంబునం దొల్లియు
ద్వీత్రుల్ పల్కినపాతకంబునకుఁ జేరెం గాల మివ్వేళ ని
న్నాతకంబునఁ బెట్టుచున్న పితృపుత్రాశిల్ విసర్జించి నీ
సూతుం గృష్ణుఁ దలంచుకొమ్మనఁగ నచ్చోఁ బుట్టె నుత్పాతముల్.

సీ. నెత్తురు వర్షించె నీరదంబులు వీచె
శర్కరాఖీలఝంఝామరుత్తు
విరివినాఁ గప్పెఁ గావిరి దిగంతముల సం

గ్రామభూస్థలి మూఁడువ్రయ్యలయ్యె
రాతె నల్కసహస్రము లెల్లెడల నిల్చి
దట్టించె భూతభేతాళగణము
భాగలేక యాయుధంబులు మండె నుజ్జ్వల
ప్రతిసూర్యమండల ప్రభలు వెలిఁగె
బభ్రువాహనుండు పాండవమధ్యమ
ప్రాణహరణ నిష్ఠురప్రచార
జాగ్రదుగ్రశరధి సంచితజ్వాలాభి
ధానశరము వింటఁ బూనుటయును. 71

శా. ఆవిఖ్యాతశరంబు హాలహాలసప్తార్చిశ్ఛటల్ గ్రాయుచున్
రా వీక్షించి సురేంద్రసూతి వివిధాస్త్రప్రౌఢి వారింప ది
గ్వ్యాపాపృథ్వ్యవరోధమై నిగిడి క్రౌర్యస్ఫూర్తిమైబంధుర
గ్రీవంబున్ వడిఁద్రుంచెఁదచ్ఛిరములక్ష్మాఘ్రాణఁగీర్తింపఁగన్.

వ. ఇవ్విధంబున బభ్రువాహనుం డాహవముఖంబున వృషకే
తనకపికేతనుల వధించి జయోత్సాహంబునం బొదలి మ
గుడ నప్పు డప్పురంబున. 73

గీ. భూరి జయవాద్యఘోషముల్ బోరుకలఁగఁ
బౌరజను లెదుర్కొనెడు సంభ్రమముబభ్రు
వాహుచే నిందిరసుతుఁ డాహవమునఁ దెఱఁ
గా విచారించి చిత్రాంగదావధూటి.

ఉ. ఉల్లము వ్రక్కలై కలఁగ నొత్తినమూర్ఛ సహించిధారణిం

ద్రెళ్లినఁ జేరి యత్తరుణిఁ దేర్చియులూచియురంబుమోముజో
త్తిల్లఁగ మోఁదుకొంచుఁ బరిదేవనమొందఁబురీవభూజనం
బల్లుకచేయుఘోషచయము లంతిపురంబున నిండఁ బర్వినన్. 75

వ. తత్కోలాహలం బాలకించి బభ్రువాహనుఁ డంతఃపురం
బుం బ్రవేశించునప్పుడు. 76

శా. నేలన్ రాలినహారవల్లికలు ఖండీభూతపాటీరదూ
ర్వాలాజాక్షతహేమపాత్రికలుఁ బ్రభ్రష్టార్ద్రనీరాజన
జ్వాలాకోరకితాంగణంబులు ననిశ్వాసంబునన్ భూవిభుం
డాలోకించుచు వచ్చి కన్గొనియె శోకాక్రాంతలం దల్లులన్.

గీ. కాంచి యిట్లను సర్వాశృంగారరచన
లెడల నేటికి నింత వావిడిచియేడ్వ
ననదృశానందకారణం బైనమద్వి
జయమునం దిట్లు శోకింపఁ జనునె యనిన. 78

క. తగువున జనించి వైశ్వా
నరుఁడు తనువుఁ గాల్చువిధమునను బుత్త్రుఁడవై
సరున నుదయించి తండ్రిని
బొరిగొంటివి విధవ కేల భూషణమింకన్. 79

క. కాంత ధనంజయుముఖమునఁ
గాంతు ఘనంజయుముఖంబు గావునఁ గొనిపో
వ్వట్టితముఁ బొందినవిజయా
ఖ్యాంతికమున కన్నఁ బన్నగాత్మజ పలికెన్. 80

ఉ. నామెలఁదోఁటలో మొదల నాటినదాడిమపంక్తికంబు నీ
పోయిన రేయి దగ్ధమయిపోయె నిమిత్తములేక యల్లకాం
తేయుని కీడుగంటిఁ దరుణీయనఁ దల్లి కుమారుఁజూచి పు
త్రా యిటుఁ గిట్లుచేయుపితృహత్య జయంబనికోరెదే మనన్.

క. అన బభ్రువాహనుఁడు ప
ర్వనభయమునఁ గలఁగి మోము వెలవెలవాఱన్
గానిపోయె నపుడ తల్లుల
జనకుఁడు పడియున్న ఘోరసమరస్థలికిన్. 82

గీ. చేర నరుగుదెంచి చిత్రాంగదయు భోగి
రాజసుతయు దివిజరాజసుతుని
పాదపంకజములపైఁ బడి యందంద
పొదలు శోకవహ్నిఁ బొగిలి పొగిలి. 83

సీ. దివిజులఁ దఱిమి ఖాండవము సప్తార్చికి
ధారవోసిన యశోధనుఁడు వీఁడె
నిటలాక్షుతోడ నెక్కటి పోరి పాశుప
తముగొన్న విక్రమోద్ధతుఁడు వీఁడె
కాలకేయాదిరాక్షసుల నుక్కడఁగించి
జయము గైకొనినదుర్జయుఁడు వీఁడె
కలన భీష్మాదియోధులగర్వ మెడలించి
పసి మరల్చినబాహుబలుఁడు వీఁడె
యగ్రజునకును రాజసూయాధ్వరప్రి

శస్త్ర నెరపినభ్రాతృవత్సలుఁడు వీఁడె
యమకుమారుల సరకు సేయక సుభద్రఁ
గడిమిఁ జేకొన్నహరిచెలికాఁడు వీఁడె. 84

గీ. అని విలాపించి వృషకేతనునిశిరంబుఁ
గాంచి తల్లులు దిగిచి వక్షమునఁ జేర్చి
తండ్రిపనిఁదీర్ప కిట్లు నాతండ్రి నిలువ
నగునె నీకంచు బభ్రువాహనునిఁ జూచి. 85

మ. తనయా చంపితి కర్ణసూను బుధమందారంబు నిందేమికీ
ర్తినినుం జెందెహయంబువెంటనిఁకఁగూర్మిన్హస్తినాపట్టణం
బునకుం బోవఁగఁగల్గె బంధువితతిం బూజింపఁగాఁగల్గె నం
దు నిజేశుంగలయంగఁగల్గెననఁదోడ్తోఁద్రుంచితయ్యాసలన్.

క. జనకునిఁ జంపినమాఁడ్కిని
జనయిత్రుల మమ్ము నిపుడ చంపుము జననీ
జనకవధం బొనరించినఁ
గనియెదు భార్గవునికన్న ఘనతరకీర్తుల్. 87

గీ. ప్రియుఁడు పరలోకగతుఁడైనపిదప సతుల
కనుగమన మొందు నర్హకృత్యంబు దగిన
తెఱఁగు గావింపఁ బనుపుము తీర్చికొనెద
మగ్నిముఖమునఁ బతివియోగాగ్ని యనిన. 88

శా. అంబా తండ్రికిమున్ హయంబుఁగొనుచున్ సాష్టాంగదం

మం బేఁ జేసిన నాదరింపక సభామధ్యంబునన్ దుష్ప్రవా
క్యంబుల్ పల్కఁగసంభవించెఁ బితృహత్యాలబ్ధియిక్కడునా
శంబై పోదు తపోవ్రతానశనయజ్ఞధ్యానదానాదులన్. 89

క. మును దా నుదయించినవే
ళనె పితృఘాతుకుఁడు గాఁగలఁడు వీఁడని నె
మ్మనమున నెఱిఁగిన ఫణిసుత
వనుఁ జంపక పెనుప నఘమునకు లోనైతిన్. 90

క. కావున నిత్తను వనలము
లో వేల్చెదననిన విని యులూచివలికె నే
లా వేగపడెదు మృతసం
జీవనమణి గలదు తండ్రి శేషునినగరన్. 91

వ. అని యమ్మణియున్నతావును, దానిప్రయోజనంబును నెఱుం
గించిన బభ్రువాహనుండు పాతాళంబునొచ్చి యురగులతో
శేషుని నిర్జించి, యాతండు ప్రసన్నుండై తనవెంట రాఁ
దజ్జీవరత్నంబుం గొని తెచ్చెనంతభగవానుండగుశ్రీకృష్ణుం
డును, దేవకీవసుదేవులును, భీమాదులును నచ్చటి కరుదెం
చిరి తదనంతరంబ.

క. నరవృషకేతనులతలల్
సిరివగుఁ డంగములఁ జేర్చి జీవదమణి పే
రురమున నొత్తిన నదికేఁ ద
శ్చిరము లయసాక్రాంత మనువుఁ జెందినమాణిక్యన్. 93

ఉ. జీవదరత్నవైభవముచే వృషకేతుఁడు లేచి శ్రీహరిం
దా వినుతించుచున్ రిపునదల్పముకుందుఁడు గౌఁగిలించెగాం
డీవియు నట్ల తేజసుతు నెమ్మిఁగనుంగొనెఁ దల్లి వాడున
న్యావలి వానఁదెప్పలుక్రియన్ గనెఁ బాండవసైన్యమత్తఱిన్.

చ. మొరసె ననంఖ్యశంఖరవముల్ దివిఁ బువ్వులవానసోనగాఁ
గురిసెఁ బునఃప్రజాతసుతఁ గుంతిగనుంగొను వేడ్కవాహిను
ల్పెరసె మురారి పట్టి కదలింపఁజమూపసమూహముబ్బుగా
నెరసెఁ బురోపకంఠసరణిం దరుణీపరిణీతలాస్యముల్. 95

ఉ. అన్నగరీజనంబు నెరయం గని వాళిగఁజల్లురత్నసం
పన్నతయుం దదంతికహిమక్షితిభృత్తటసీమ నోలగం
బున్నకుమారుఁజూచితలలూఁచినృపుల్ గొనిమాడఁగ్రీడియున్
వెన్నుఁడు బభ్రువాహరమణీయసభాస్థలిఁ జొచ్చియచ్చటన్.

క. ఘనరత్నభద్రపీఠం
బున నిరువురు నుండి రితరభూపతులచ్చా
ననులై రప్పుడు నమితా
ననుఁడగు నరుఁజూచి భోగినాయకుఁడనియెన్. 97

క. ధాత్రీశుల కర్జున స
ర్వత్రజయముఁ బుత్రుచేఁ బరాభవముఁ గనం
జాత్రము భవదీయసుత
జూత్ర మెఱిఁగి మెచ్చ కిటుదగదు లజ్జింపన్. 98

వ. అవియునుంగాక నీకు గంగాశాపనిమిత్తంబుననిట్టివిపత్తుసం

భవించె చిత్తంబున నుత్తలంబునొందకముకుందునికరుణా
విశేషంబునం జెందినభవన్నందను సకలరాజ్యభోగంబులన
నుభవింపుము నీకళత్రంబు లైనచిత్రాంగదాభుజంగరాజపు
త్త్రికల హృజ్జనితశోకంబు లుజ్జగింప బుజ్జగింపుములజ్జితుం
డైన బభ్రువాహను నుపగూహనంబున నాదరింపు మని
వారి జ్ఞోదరుం గనుంగొని. 99

సీ. దేవ కవ్వడినొప్పిదీఱ బోధింపు మి
త్త్రఱి దేవకీయశోదలును గుంతి
యును దండ్రిబిడ్డల నొద్దిక సేయంగ
వలయు వీరుఁడు బభ్రువాహనుండు
విష్ణు భక్తుని దయాన్వితుని ధాత్రీవ
త్సలుని నూర్జితయశోధనుని నాత్మ
జనకుని మార్కొన్న పెనుఁబాతకమువాయఁ
బ్రాచితంబుగఁ దుషారాచలంబు
దండఁ దనమేను విడువంగఁ దమకపడెడు
ననినఁ జిత్రాంగదాతనూజునిమనంబు
తెంపుఁ గనుఁగొని యదినివారింపఁ దలఁచి
పవనజుఁడు పల్కె గంభీరభాషణముల. 100

గీ. గురుఁ బితామహుఁ దోఁబుట్టుగులవధించి
దురితములఁ జెంద మాయచ్యుతుని భజించి ;
కలుషమతి నైన నిన్ను డగ్గఱుకొని శౌరి ;

జీవపిత వీవునెఱయంగఁ బావనుఁడవు. 101

క. విను నాలవయుగమున నీ
తనినామస్మరణమునఁగదా మర్త్యులు పా
వనులైరి కృష్ణుఁ గొలిచిన
మనలకు భయశోకదైన్యమగ్నత గలదే. 102

క. అని పెక్కుచందములఁ బా
వని దెలిపిన నప్పుడు బభ్రువాహనుఁడు మనం
బున నెగులు విడువ నందఱుఁ
గొనియాడిరి విజయుపట్టి గుణకథనంబుల్. 103

